# మహిమాంగనలు

[ ద్వితీయ భాగము. ]



గ్రంథకర్త.

[illegible]

# మహిమాంగనలు

[ ద్వితీయ భాగము. ]


గ్రంథకర్త:

కొడాలి సత్యనారాయణరావుగారు.



పబ్లిషర్సు:

కాసంశెట్టి కృష్ణమూర్తి.

ప్రొప్రయిటర్సు.

కాసంశెట్టి శేషగిరిరావు అండ్ బ్రదర్సు,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు. ఏలూరు.

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు.

శ్రీ పాండురంగ ముద్రాక్షరశాల, ఏలూరు.

1932.




(వెల రు 0-5-0



పాలి వేంకట మునియ్యాగారి స్వకీయమగు

ఏలూరు శ్రీ పాండురంగ ముద్రాక్షర శాలయందు

ముద్రింపఁబడియె.



# మహిమాంగనలు.



[ ద్వితీయ భాగము. ]

## 1. జయప్రద.



జయప్రద సోమదత్త మహారాజు కుమార్తె. ఈమెతల్లి
పేరు పంకజవల్లి. జయప్రద తలిదండ్రులు చాలకాలము సంతా
నము లేమిఁజేసి జపతపంబుల ననేకముఁ గావించి యీతనయను
బడసినందున వారలీమె నతిగారాబముగాఁ బెంచుచుండిరి.
జయప్రదయు జననీజనకుల ముద్దుముచ్చటల ననుభవించుచు
వారిచే నియమింపఁబడిన గురులకడ విద్యల నేర్చుచు, నీతులం
గఱచుచు, సత్కథల నాలించుచుఁ దన కుశాగ్రబుద్ధిచే నత
ల్పకాలముననే సకలవిద్యాపారంగతురాలనియనిపించుకొనెను
ప్రవర్తనము చేత సుగుణశీల యనెడి విఖ్యాతి గడించెను.
రూపముచే నిరుపమానసౌందర్యరాశి యని పేరుఁ బొందెను.
ఇట్లుండ జయప్రదాదేవికి వివాహముఁ జేయఁదగిన ప్రాయము
వచ్చినది. తలిదండ్రులు తగిన వరుని సంపాదింప నాలోచించు
చునే యుండిరి. జయప్రద దాసీజనంబుతో నుద్యానవనంబునఁ
జేరి సరస సల్లాపములతోడను, పుష్పాపచయంబుతోడను

నాటపాటల తోడను ననుదినంబును గొంత గాలంబుఁ గడిపెడి యలవాటు. ఆయలవాటు ననుసరించి యొకనాఁడు జయప్రద సఖీమణులతో నుద్యానవనంబున వినోదముగఁ గాలక్షేపముఁ జేయుచున్న సమయంబునఁ బ్రస్తావన వశంబున, నానాదేశాధీశ్వరుల రూపాదికములఁ గూర్చి సఖుల వలన నాలించి, యందు షట్చక్రవర్తులలో నొకఁడైన పురూరవుని రూప, గుణ, సౌందర్యంబులకచ్చెఱువంది యెట్టులైన నామహానుభావునిఁ జెట్టఁబట్టవలె ననెడి తలంపుఁ గలిగి యుండెను.

ఆమె పుణ్యంబు ఫలియించినదో యన నాఁడే పురూరవ చక్రవర్తి వేఁటకై తత్పరిసరారణ్యమున కేతెంచి, యటఁ గల క్రూరమృగంబుల వధియించి, తత్కారణంబునఁ గలిగిన యాయాసమును దీర్చుకొన నా యుద్యానవనంబుఁ జేరి, యందొక్క కాసారంబు గాన్పింప, నటకరిగి, విమలసలిలంబులఁ గ్రోలి, యొక రసాలవృక్షచ్ఛాయను విశ్రమించి యుండెను.

ఆసుందర విగ్రహంబును జూచినది జయప్రద. తాను బురూరవుని యందచందములఁ గూర్చి వినిన వర్ణనంబంతయు నాతనియందుఁ దాండవించుచుండుటయే యాతఁడు పురూరవుఁడేయై యుండునని భ్రమించి తన సఖీబృందమున మిగులఁ జాతుర్యముఁ గల శ్యామలత యను నెచ్చెలిఁ బిలిచి "సఖీ

మణీ! ఎవ్వరో యొక మహానుభావుఁడు మన కట్టెదుట నొక వృక్షచ్ఛాయను విశ్రమించి యున్నాఁడు. వాని సౌందర్యము నాకెంతయు ముఱుపుఁ గొలుపుచున్నయది. నీవు వెడలి వాని యుదంతంబెల్ల నెఱింగిరాఁగలవా" యన నామె యెంతయు నుత్సాహంబుఁ జెంది పురూరవుని చెంతకరిగెను.

అటఁ బురూరవుండూరక లేఁడు. వానిదృష్టి యీవలికే జయప్రద దెసఁ బాఱినది. ఆమెముఖతీరును, గురులయందమును, నేత్రముల సొంపును, నడక చందమును, గూర్చి యేమేమిగనో వర్ణించుచుఁ దనయిష్టసఖుండగు వసంతునితోఁ జెప్పుచుండెను. ఈ సమయమందే శ్యామలత జయప్రద సందేశమును గొని వచ్చినది. వినయపూర్వకముగా నందుఁగల యిరువురకును నమస్కరించినది. వసంతుని దెసఁ జూచినది. "ఆర్యా! మీ రెవ్వరు? మీ పురంబెయ్యది? మీ నామములేమి! మీవంశం బెట్టిది? రాతొయ్యెలులు విహరించెడి యీ యుద్యానవనంబున కొకరి యనుజ్ఞలేక రాఁదగునా?" యని ప్రశ్నింప వసంతుఁ "డలివేణీ! ఈ మహాత్ముఁడు పురూరవచక్రవర్తి. నేను వానికిఁ బ్రియసఖుండను. మృగయావినోదముకొఱకై యీ ధారుణీ వల్లభుండీపరిసరారణ్యంబునకు విచ్చేసి వేఁటతమకంబుననందుఁ జేరి విమలసలిలంబుఁ గొని విశ్రమించి యున్నాఁడు. ఇదియ మావృత్తాంత" మని తెలుప నామె తత్క్షణంబ రాజ కుమారి కెఱుకపఱుచుటకై యావృత్తాంతంబు నెఱిఁగించుచు నామె

పురూరవునిగూర్చి వినినదానికంటె నెన్నియోమడుంగులెక్కు-
డుగఁజేసి వాని రూప, గుణ, సౌందర్యమును గూర్చి తన
పాండిత్యము నుపయోగించి వచియించుచు నా జయప్రదకుఁ
బురూరవునిపైఁగల తమకంబును మఱింత వృద్ధిఁ గావించెను.
అంతట ప్రభుండు తన యుద్యానవనంబునఁ జేరి సేదఁ దేఱఁ
దలంచుట గొప్ప విశేషముగదా యని సంతసించి తన కృతజ్ఞ
తావందనంబుల మఱల నా శ్యామలతవలననే యా ధారుణీ
వల్లభునకందఁజేయ నా శ్యామలతతో "సారసాక్షీ ! మీరాజ
కుమార్తె యంపిన కృతజ్ఞతావందనంబుల కేనెంతయు ధన్యుఁడ
నైతిఁ గాని యొక్క విశేషము. ఆ యింతి కన్యవలెఁ దోఁచు
చున్నది. నామనం బామెయందు లగ్నమై యున్నది. నన్నుఁ
బరిణయంబై సకలసుఖంబుల ననుభవింప మీసఖీమణి యంగీ
కరించునా" యని ప్రశ్నింప "నావిషయంబును నా నెచ్చెలినే
యడిగి తెలిసికొనివత్తు" నని శ్యామలత మఱలవెడలి పురూర
వునియభిప్రాయమును దెలిపినంత నాజయప్రద "శ్యామలతా!
జననీజనకుల యంగీకారముఁ బడయక నేనేమి వచియించుట
కస్వతంత్రనుగదా! ఇందునఁగూర్చి వారినే ప్రశ్నించి వారంగీక
రించిన నాకభ్యంతరమేమియులే" దని సమాధానమొసంగి
నంత నా శ్యామలత బిఱబిఱఁ జని యాసమాధానమునే పురూ
రవుని చెవిని వైచినంత నామెవినయసంపద కెంతయు నచ్చెఱు
వంది యట్లనే యొనర్చెదనని వచియించి స్వరాష్ట్రమునకుఁ

జని తగిన లాంఛనములతోఁ బయనమై వచ్చుచుఁ ద్రోవలో గోదావరియందు స్నానమొనర్చి యటఁగల మహాపవిత్రస్థలంబు లన్నిఁటిదర్శించి, సోమదత్తుని రాజధానియగు విశాలానగరంబు నకరిగి సోమదత్తుని దర్శించె. ఆతండును జక్రవర్తిరాక కెంతయు ముదంబుఁ జెందినగౌరవంబుగ గౌరవించి, కుశలంబుల నారసినంతఁ బురూరవుండు తానువచ్చిన కార్యంబును నివేదింప సోమ దత్తుండు సంతుష్టాంతరంగుఁడై తనహర్షంబును బ్రకటించుచు నింద్రపురాధిపుఁ డటనుండఁగనే పురోహితుని రావించి వివా హంబునకు సుముహూర్తమును నిశ్చయించి "సార్వభౌమా! నా తనయను మీ యట్టివాని కిచ్చుటకంటె మఱియొండు విశేషముండునా? మీరు మీ ప్రయత్నంబున నుండఁదగు"నని వాక్రువ్వఁ బురూరవుం డింద్రపురంబునకేగి సకలసన్నాహ ములఁ గావించుకొని యార్యులు నిర్ధరించిననాఁటికి విశాలా నగరంబుఁజేరి యతివైభవముతో జయప్రదను బరిణయం బయ్యెను. తమ రాజకుమార్తె యొక చక్రవర్తి కిల్లాలైనం దుల కారాష్ట్ర ప్రజలెంతయు నానందమందిరి. జయప్రదయుఁ దాను గోరికొనిన వల్లభుని లభియింపఁజేసిన పరాత్పరుని వేవి ధంబులఁ గొనియాడెను.

సోమదత్తుండు తన తనయ నత్తవారింటికి కంపునపుడు కుమార్తెను జేరువకుఁబిలిచి "తనయా! నీవియోగము మాకుఁ

గష్టదాయక మయ్యును నాఁడువాండ్రెన్నఁటికేని నొరుల
గృహములఁ జేరవలసిన వారలేగదా! సకలగుణ గ్రహణ-
పారీణవగు నీకునేను విశేషించి తెలుపఁదగిన హితంబు-
లేవియు లేకున్నను బెద్దవాఁడ నగుటచే నావిధి నెరవేర్చు
కొనక తప్పదు. అమ్మా! అత్తమామలను, నాఁడుబిడ్డలను,
బావమఱందులను, గడు భక్తితో గారవింపవలయును
మగనిమాట జవదాటఁజనదు. నిరుపేదలయెడఁ గని-
కరము ముంచుకొనవలయును. ముమ్మాల ననుదినంబును స్మరి-
యించుకొనుచుండుము. పొరుగిండ్లకరిగి ప్రొద్దులఁ బుచ్చు-
టయుఁ బరపురుషులతో ననవసరముగా సంభాషించుటయు
మగువలకుఁ గూడనిపని. దయా, సత్య, శౌచములను నిరం-
తరమును గాపాడు కొనవలయును. గృహకార్య నిర్వహణము
నెడ నేమాత్ర మేమఱుపాటుఁ జెందరాదు. పతి భుజింపక
మున్న భుజించుటయుఁ, బెట్టుపోతలయందుఁ బాక్షికబుద్ధి
నుంచుకొనుటయు, దైవధ్యానమును మఱచుటయు మహో-
పాతక హేతువులుసుమా! ఈహితంబుల నన్నిఁటి మనంబున
నిల్పుకొని ప్రవర్తింపు"మని సీతులఁ గఱపి పురహారవ్రున
కామెఁ బోషించునెడఁ జూపవలసిన దయాదాక్షిణ్యములఁ
గూర్చి విన్నవించి యా దంపతుల కొసంగవలసిన కట్నములు
యథావిధి నొసంగి సగౌరవంబుగా వీడ్కొల్పెను.

(3)

పురూరవుండు సతీయుతుఁడై యింద్రపురంబునకుఁ జేరి శాంతి శమదమాది సద్గుణంబులచే విరాజిల్లుచుఁ బ్రజాపరి పాలనంబొనర్చుచుఁ గొంతకాలమున కిరువురునందనులఁ బడసి ముదంబునఁ బెంచుకొనుచుండ నొక్కనాఁ డత్రిమహర్షి విచ్చేసెను. ఇతండు పురూరవునకు ముత్తాతయగును. పురూరవుండును, జయప్రదయు వానియెడఁ జూపిన గౌరవంబునకును వినయంబునకును, భక్తికిని యత్రిమహాముని మిగులసంతసించి యాపత్కాలంబున నాకలిదప్పికలవలన నెట్టి యాయాసముఁ గలుగకుండునట్లును; దుష్కాలమునఁ బ్రాణభయంబు లేకుండు నట్లుగను వరం బనుగ్రహించి వెడలిపోయెను. అత్రి త్రికాలజ్ఞుఁడుగాన నీదంపతుల కచిరకాలముననే సంభవింపనున్న విపత్తుల గ్రహించియే యట్లొనర్చి యుండనోపు.

బాలురకైదేండ్ల ప్రాయమువచ్చినది. నేఁడో, రేపో, అక్షరాభ్యాసముఁ జేయింపవలెనని పురూరవుండు తలంచుచుండెను. ఇట్టిస్థితియందే వానిగ్రహస్థితిమాఱుటయుఁ, బరరాజులచే రాజ్యంబాక్రమింపఁ బడుటయు సంభవించినందున, భార్యా పుత్రులఁ బోషింపఁదగిన తెఱువుఁగానకఁ నెటకేనిఁ బోయి యేదోనొకవృత్తిచే జీవింపఁదలఁచియాలుబిడ్డల వెంటఁ గొని యొకత్రోవఁబట్టిపోవుచు నొక మహారణ్యముఁ జేరెను.

ఆయరణ్యమెంతయు భీకరమై, క్రూరమృగసంకులమై, నరసంచా
రములేనిదై యుంటచే నిల్లాలును, బిడ్డలును నాప్రదేశమును
విలోకించియు, నామృగ గర్జనంబుల నాలించియు నడలిపోవు
దు రనియెడి భయముచే నా యరణ్యంబునఁగల ప్రకృతివిచిత్ర
ములఁ జూపించుచు, వారిశ్రమమును వాపుచు, నెట్టిదిగులు
నెందనీక మెల్లఁగ నడిపించుచుండెను. తనకుఁ గలిగిన మహా
పదకెంతయు వగచుచు రాష్ట్రమును విడువకమునుపే తన
భార్యను బిడ్డలఁగొని పుట్టినింటికిఁబోయి సుఖియింపుమని బ్రతి
మాలుకొనెను గాని యుత్తమసతీలలామ యగుటచే జయ
ప్రద యందుల కంగీకరింపకఁ బతివ్రతల కుండవలసిన లక్షణ
ములఁగూర్చియు, వానియందుండు మహత్తరశక్తియుఁ బెనిమి
టికిఁ దెలిపి, యొప్పించి వాని ననుసరించెను.

ఇటులఁ బురూరవుండు భార్యాసహితుఁడై యా గహ
నంబున నడచుచుండ నొక మువ్వన్నెమెకము వెంబడింపఁ
దన బాహుబలనైపుణ్యముఁజూపి భార్య వలదనుచున్నను
వినక దానిఁ జంపెను. జయప్రదయుఁ దన్నుఁగూర్చియుఁ, దన
సంతానముఁగూర్చియు భర్తపొందుచున్న కష్టములకు వగపుఁ
జెందుచుండియు, నాయరణ్యమునఁ గల కంటకములచేతను,
గులకరాళ్లచేతను పాదములుబాధనందుచున్నను భర్తయటెంత
చింతాకులచిత్తుఁడగునని యెంచి యొకకుఱ్ఱవానిఁ బెనిమిటి
యెత్తుకొనినడుచుచుండఁ దానొకతనయునిజంకనిడుకొని లేని

ధైర్యముఁ దెచ్చుకొని పతివెంటనడుచుచుండెను. ఎట్టులెటులో బురూరువుం డాయరణ్యంబును గడచి యటనొకపదియావఁగల సోమపురంబను నొకపురిఁజేరి యటఁ గూలినాలిఁ జేసికొని జీవించువారి యాశ్రయము సంపాదించి యందఱ కొకభ్రాయస కాఁడై వారొసంగిన యల్ప ధనంబునుగొని భార్యాపుత్రులఁ బోషించుకొనుచుండెను.

ఆ యూరనొక కోమటికలఁడు. ఆతఁడు వర్తకముఁ జేయుచు లక్షలాదిగ ద్రవ్యంబు గడించెను. అంతవఱకు నాతఁడును ధార్మికవృత్తిచేతనే ప్రవర్తించెనుగాని వానికిని దశ తొలఁగిపోవు దుర్గ్రహములు దాఁపురించినవి. కాని యావిషయ మాతఁడెఱుఁగఁడు. ఒకనాఁటికంటె నొకనాఁటికిఁ దన యాదాయము హ్రస్వమగుచుండుటచేఁ దగిన పండితుల రావించి యందులకుఁ గతమెఱింగి యెట్టులేనిఁ దన దుర్దశఁ బాపుకొనఁదలంచి సత్కార్యముల నొనర్ప నిశ్చయించుకొని తటాకనిర్మాణమున కుపక్రమించెను. అందునకు వలయు కూలీల నేర్పఱచుకొనుటలోఁ గూలీల యజమాని యభీష్టము ననుసరించి వాని వ్రాయసకాఁడగు పురూరవునకుఁగూడ కూలితోఁబాటు బత్తెమిచ్చుట కంగీకరించెను. ఆయల్పబత్తెమే పురూరవుని కుటుంబమునకాధారమయ్యెను. కాని వీని యింటికి నిరంతరమును బిచ్చగాండ్రు వచ్చుటయు, బిచ్చమిడెడి యాధారములేక పొమ్మని వచించుటయు జరుగుచుండుటచే

వనేక దానములఁ జేతులవిూఁదుగాఁ జేసిన పుణ్యాత్మురాలు-
గాన లేదనెడి శబ్ద ముపయోగించి నిరుపేదల నిరాదరిం-
చుట జయప్రదకుఁ గష్టముగాఁ దోఁచెను. ఇందులకుఁ దగిన
మార్గ మేదైనఁ గలదాయని యోచించెను. ఒకనాఁడు
మెల్లఁగఁ బెనిమిటికడఁజేరి నాథా! ఇహసుఖంబులకొఱకెట్టి
కష్టముల ననుభవించుచుంటిమో, పరసుఖంబులఁ గూర్చియు
గూడనటులఁ గష్టపడుట మనకు శ్రేయోదాయకముగదా!
మీరు గడించు ద్రవ్యము మన కుటుంబమునకే సరిపడుచు,,
నిరంతరమును వచ్చిపోయెడి బిచ్చగాండ్రకు "లేదుపో"మ్మని
వచియింపవలసి వచ్చుచుండెను. నాకుఁ దామనుజ్ఞనిచ్చిన
నేనును మీతోఁబాటుఁ గష్టపడి కూలిచేసి వచ్చెడి యాదా-
యమును బీదల కుపయోగింతు"నన నామె సుగుణప్రవృత్తి-
కాతండెంతయు సంతసించి వల్లెయని సమ్మతించినందున నా
తలోదరి నాఁటనుండియుఁ బెనిమిటితోఁ బాటు కష్టించు-
చుండెను.

(4)

కూలివాండ్రందఱును గష్టపడుచున్న దొకచోటనే-
యగుటఁజేసి సురూపసంపదయగు జయప్రదనొకనాఁడొకతటాక
నిర్మాణమున కుపక్రమించిన వర్తకుండు చూచి యామెపై
మరులుఁగొని యెట్లయిన నామెను తన మందిరమునకు రప్పింప
వలయునని నిశ్చయించుకొనెను.

ఒకనాఁడా వర్తకుండు సాయంసమయంబునఁ గూలీల కందఱకుఁ గూలి నొసంగఁ దలఁచి, మగకూలీల కందఱకిచ్చి, పంపించి, యాఁడువాండ్రకునొసంగి,జయప్రదకుమాత్రమీయక "ధనమైపోయినది. ఇంటికివచ్చి కూలిఁ గొని వెళ్లుమ" దని యాజ్ఞ నొసంగినంత నాయువతి వర్తకుని యానతి మేఱకు వానియింటికి వెడలెను. ఈలోపుననే వర్తకుఁ డిల్లుఁజేరి ద్వార పాలకులరావించి జయప్రద కూలికై వచ్చిన "మాయజమాని నీకూలిడబ్బును గదిలో బల్లపైనుంచి వెడలెను. కొనిపొమ్మని వచింపుఁడు. ఆమె లోనికిఁ బ్రవేశింపఁగనే గదితలుపుల బిగింపు" మని ముదలనొసంగ వారట్లనే కావించిరి.

జయప్రద తానులోనికిఁ బ్రవేశించినంతనే ద్వారపాల కులొనర్చిన దుర్ణయము నెఱింగి, తనకాకస్మికముగ సంభవించిన యీ పెనుముప్పునకెంతయుఁ జింతించుచుఁ దనకెట్టిప్రమాదము వాఁటిల్లునో యనెడి భయంబున నందుఁగల యొకమందసమునఁ బ్రవేశించెను. ఆమందసమునందు గాలిచొరుటకు మాత్రమే యవకాశముకలదు. ఆవర్తకుండును మందయాన చిక్కినదిగదా! యిఁకనామెతో సుఖగోష్ఠిఁజెందఁ దగునని సంతసించి గదియంతయుఁగలయవెదకి యెందునుఁగానక నాపెట్టె కడఁజేరి యందున్న యిల్లాలి నీవలకు లాగఁ బ్రయత్నింపఁ దలంచె. వీనిప్రయత్నము నాపెకనిపెట్టి పతివ్రతకావున నా యీశ్వరునిపై సకలభారమునుమోపి "నేనుమహాపతివ్రతనైతి

నేని, యాకలిచేఁగాని, దప్పికచేఁగాని, నీటిచేఁగాని, యితర మృగములచేఁగానినాభర్త వచ్చియీపెట్టెదెఱచునందాక నాకుఁ జావులేకుండుఁగాక. నాపెనిమిటికిఁదక్క నన్యులకెవ్వరి కీమందసమును దెఱచు శక్తిలేకుండుఁగాక" యని వాక్రుచ్చుచు నా పెట్టెను మూసివైచెను. ఆమెపాతివ్రత్యమును బాగుగానెఱింగిన సరస్వతీదేవి యామెవాక్యములపైఁ గటాక్షముంచియామె వాక్యములకూతఁగల్గించెను. వర్తకుండామందసం బావిధంబున బిగియింపఁబడి యుండుటఁజూచి, యారహస్యమునేరైన నెఱింగినచో గొప్పముప్పురాఁగలదని యోచించి యెట్టులేనినాపెట్టె బ్రద్దలుఁగొట్టింప నిశ్చయించి పడరానిపాట్లఁబడి హతాశుఁడై చివఱకామందసమును సముద్రమునఁ బాఱవైవఁదలపెట్టెను. ఆతం డీవిషయము నెంతగోప్యముగ దాఁచవలయునని యూహించెనోగాని క్రమముగా వానిమందిరంబున వసియించువారెల్లఱకుఁ దెలిసి యనేక విధంబుల మందలించిరి. ఆతఁ డేమిసేయఁగలఁడు?

ఈ వర్తకుని మనోనిశ్చయమును గ్రహించి జయప్రద వానితో "నోయీ! వర్తకుఁడా! నీయాలోచన మెంతయు వృథాకాఁగలదు. సముద్రమునఁ బాఱవైచినంత మాత్రమున నాకెట్టి ప్రమాదముఁ గలుగనేరదు. నాకొక వ్రతము కలదు. ఆవ్రతమింక నేడు వత్సరంబులున్నర గడచిన నీపెట్టె తనంతటఁ దానే తెఱచుకొనఁగలదు. అంతఁ దనుక నీవే కనిపెట్టి చూచు

చుండు"మన నాసెట్టి యామె పలుకుల కెంతయు నాశ్చర్య మంది యాయింతి యేడున్నరవత్సరంబు, లాకలి దప్పికలు లేక యెట్టుల మనగలదో చూతమని యాపెట్టెనుగొనిసింహాపురంబు నకుం జని యచట భద్రముచేసి వర్తకముసేయ నారంభించెను. జయప్రదయు నామందసమున గాలిని మాత్రమాకర్షించుచు నత్రిమహాముని యాశీర్వచనప్రభావంబున జీవించుచుం దన భర్తను గూర్చియు,సుతులంగూర్చియు నెంతయుదుఃఖించుచుండెను.

(5)

"కూలిం గొనిపోవుట కై వర్తకునియింటి కరిగిన భార్య యెంతకును రాదయ్యె నేమికారణంబో కనుంగొని వత్తు"మని పురూరవుండు యావర్తకునియింటికరిగివిచారింప నెవరుసెప్పినను గూలింగొనిపోయి చాలసేపయ్యె ననెడివారేగాని నిజోదంత మెఱింగించువారు లేకుండిరి. అంతతో నాతని హృదయమున గొప్పయనుమాన ముదయించి వెదకం దగిన తావులన్నింట వెదకి నిస్పృహుండై మఱల నింటికిం జేరి సుగుణాలలామ యగునామె కానరామి కెంతయు వగచుచుం దగిన గత్యంతరముంగానక బిడ్డల నిరువుర నెత్తుకొని యానగరంబు విడిచి యాపె నన్వేషించుచు నొక మహారణ్యమునం బ్రవేశించి, యందుంగానకం దనపయనంబింక ముందునకు సాగించుచుండ నొకసెలయేరు గాన్పించెను. ఇప్పుడాతం డాయేరును దాటవలసి

యున్నది. అందుచే నొకకొమరు నిద్ధరి నిలిపి యొకకొమరు నెత్తుకొని యాయేటినిదాటి యావలిగట్టుననుంచి రెండవవాని కొఱకై యావలికివచ్చుచుండఁ గర్మవశంబునగొప్పవెల్లువవచ్చి యాప్రివాహంబునఁ బడి పురూరవుండు గొట్టుకొనిపోవుచుండెను. ఈ విపరీతమును నద్ధరిఁ గలమెఱకప్రిదేశమునగొఱ్ఱెల గాఁచుకొనుచున్న గొల్లలుకొందరు వీక్షించి దయాకలితస్వాంతులై వానినెట్టెట్టులో నొడ్డునకుఁ గొనివచ్చి కాపాడిరి.

వల్లవుల యాశ్రియమునఁ బురూరవుండు మూఁడు దివసంబులు వారొసంగిన యంబలిఁద్రావుచు నేటియొడ్డున విడువఁబడిన పిల్లల గతి యేమైనదో యని మిగుల వగుచుచు నప్పటి పోషకులగు నాగొల్లలు నియమించిన సేవకావృత్తి ననుసరించి నొక గొఱ్ఱెలమందను మేపుచు నియమితస్థానమగు నొక కళ్ళము కడ మందనాపి యొకచో విశ్రిమించియుండ నాకస్మికముగ నాతనికి గాఢమగు నిదురఁబట్టెను.

సింహపురాధీశ్వరుని కోటలో నాక్రిందటి రాత్రిదొంగతనముజరిగెను. రాజభటులాదొంగతనముఁ జేసిన చోరులఁబట్టుకొని యాచోరులకడఁ గొంత లంచంబుఁగొని వారపహరించిన నగలను గొనివచ్చి పురూరవుని తలక్రిందనుంచి, వానిని లేపి, యతఁడే దొంగయని పట్టుకొని వెడలి రాజసన్నిధిని నిలుప రాజామహాసీయునిఁ జెఱసాలయందు నిలిపెను. తాను పూర్వమనుభవించిన మహోన్నత దశకును, నిప్పు డనుభవించుచున్న

హైన్యదశకును గల తారతమ్యములఁ దలంచుకొనుచుఁ జెఱ
సాలలోఁబురూరవుఁడెంతఁగా విలపించెనో భగవంతునకే యెఱుక.
పాపము ! పురూరవుండు మొదటినుండియు నీశ్వర చరణార
వింద భజనాసక్తుండుగాన నాయీశ్వరునే ధ్యానించుకొనుచు
నాకారాగారంబున దినంబుల లెక్కించుచుండెను. ఇట్లుండగనే
యా దేశప్రభుండొకనాఁడీ మహానుభావునిపై నకారణముగ
మోపఁబడిన నేరమును విచారించి పదకరంబులఁ దెగఁగొట్టు
నటులఁదీర్పుఁ జెప్పెను.

కరచరణంబుల ఛేదించు కాలము సమీపించుచున్న
కొలఁదియుఁ బురూరవునకు విచారము హెచ్చగుచుండెను.
విచార మినుమిడించిన కొలఁదియు దైవధ్యాన మెక్కుడగు
చుండెను. ఆదైవధ్యానమైనను వట్టిదిగాదు. పురూరవుండు
సంగీతవిద్యానైపుణీధురంధరుఁడని విఖ్యాతిఁగన్నవాఁడగుటచేఁ
దన ప్రవీణతను జాటించుచు, భగవంతు నెట్లయినఁ బ్రసన్నునిఁ
జేసికొన నుద్యమించుచుండెను.

ఆదేశపురాజపుత్రిక పేరుపుష్పపాంచాలి. సంగీతసాహిత్య
ముల యందధిక ప్రవీణురాలయి యుండుటచేఁ దన్నుగానవిద్య
యందు మించఁగలిగెడి మహాభావులనే వరియించెదనుగాని
యితరుల నొల్లనని మొకి దీక్షవహించి యుండుటచే నింకను
కన్యాత్వేము నేగదుపుచుండెను. చెఱసాల రాజమందిరమునకుఁ

జేఱువయందుంట చేఁబురూరవుండుతనగానమాధుర్యమును వెదఁ జల్లుచుఁ జేయుచున్న శివస్తోత్రము పుష్పపాంచాలి వీనులఁ బడుట కాస్పదమేర్పడి యాగానరసముఁ గోలుచున్న కొలఁదియు నామె కాపాటకునిఁ గనులారఁజూచి, యానందించి, యమ్మహామహునిఁ జెట్టపట్ట వలయుననెడి యారాటము హెచ్చెను.

ఆనగరాధీశ్వరుండు తన కుమార్తె యభీష్టమునెఱింగి స్వయంవర ప్రకటనముఁజేయ నానాదేశాధీశ్వరులును గాయక శిఖామణులును నాపురంబునకరుదెంచిరి. పుష్పపాంచాలియు నా గానవిద్యాప్రభావుఁడెవ్వరో యెఱింగి " నేరస్థుఁడైననేమి? వానికె మాత్ర మీస్వయంవర ప్రదేశమునకు విచ్చేయుట కేల యధికారము లేదు ? ఆతండును విద్వాంసుఁడే. జేపు శిక్షింపఁ బడిన శిక్షింపఁబడునుగాక ! ఎవరిగతి యెటులున్నదియు నెవ్వ రెఱుంగుదు"రని తన హృదయాంతర్గతాభిప్రాయమును వెలువ రించి మోక్షులైన నేమి పురూరవునిఁగూడ స్వయంవరస్థలంబునకు రప్పించెను.

ఆపుష్పపాంచాలి తనగానమాధుర్యముచే శివస్తోత్ర మొనర్చుచుఁ బ్రజ్ఞాతిశయముచేఁ దన వీణ నొక రాతి మీఁద నుంచి యారాతిని గరిగించి, నంత రాతిలో వీణ బిగిసి పోయె. "ఏమహనీయుండా వీణ నారాతినుండి తీయఁగలరో వారిని నేవివాహ మాడుదు"నని నిర్భయముగా వచించెను,

అటఁగలవారెల్లఱును బ్రియత్నించి విఫలమనోరథు లైనంతఁ జేతులకు సంకెలలఁ దాల్చియున్న పురూరవుండు రాతిపైఁగూర్చుండి శృతిమేళవించి తాళంబువేయుచు నా యుమామనోహరునిఁ గీర్తించుచుఁ దన గానలహరిని బ్రదర్శించి యారాతినిగరగించి వీణెనుబైకిఁ దీసినంతఁ బుష్ప పాంచాలి మనంబున నధికానందమంది చేతనొకపుష్పమాలికఁ దాల్చి యామాలను బురూరవుని మెడలోవైచె. స్వయంవ రార్థమై వచ్చినరాజవరేణ్యులెల్లఱు వెల్లఁబాఱినవదనంబులతో నాసభాస్థలంబును బాసి చనిరి.

గాంధర్వవిధిని వివాహమాడిన పుష్పపాంచాలి తన మగనితో సోమపురికిఁజని యాయూరనొక సత్రంబుననుండఁ బురూరవునకుఁ జెడుదినములుపోయి, మంచిదినములు వచ్చు టచే నచటిప్రజలు తమ పాలకుఁడు గతించిన కారణముచే రాజ్య మరాజకముగ నుండుట బాగుండదని నిశ్చయించుకొని వచ్చి పురూరవుని దమరాజ్యసింహాసన మధిష్ఠింపవేఁడ వారల మొఱఁ బురూరవుండు శిరసావహించి యట్లనె ప్రభుత్వము సేయుచుండె.

ఏటియొడ్డున డిగఁబడిన పసిబాలురెండును దిక్కుఁ గానక నట గొల్లున నేడ్చుచుండఁ జెంగియనునొక గొల్లది యాబిడ్డలనాదరించి యింటికిఁగొనిపోయి, వారికి సకల సౌఖ్య ములసమకూర్చిపోషించుచుండెను. పిల్లలులేనిదగుటచే నాబా

భురయెడ సమింతానురాగముఁ గలిగి వారికిఁ గావలసిన విద్యల నెల్ల నేర్పించెను. వారును తమపోషణ కర్త్రిని మాతృదేవిఁ బలెఁ జూచుకొనుచు నతిజాగరూకతతో మెలంగుచుండిరి.

“అక్కటా! సాటికూలివాండ్రు నేఁగానరామి కెట్లుగా భావించుచుండిరో? మద్వియోగభరముచేఁ గృశించిన భర్త గారి నెవ్వరాదరించుచున్నారో? తనయులు నన్నుఁ దలంచు కొనుచు నెంతగా నడలుచుండిరో? హా! పరాత్పరా! ఈయాపదలకంతములేదా? మేము మాజన్మములనీలాఁటికష్టము లతో గడుపవలసినదేగదా? మాకింకేదిదిక్కు? నేనును, నాభర్తయు, నాకూనలును మఱల నీలోకములోఁ గలిసికొ నమా? మాపై నీకింతద్వేషమా? దయామయా! సుఖము లందుఁగాని, కష్టములయందుఁగాని నీభజనమేమఱియుండమే? అట్టిమాపై నీకింకఁ గరుణరాదా? నీవుగట్టిఁగాఁ బసిబూని యిట్టివిషపరీక్షల ముంచుచుండ మేము నిలువఁగలమా? మహాప్రభూ! ఇఁకనైనఁ గరుణించి మమ్ముద్ధరింపు”మని యా పరాత్పరునిఁ బ్రార్థించుచు మహాసాధ్వియగు జయప్రద యెంతయుఁ బొక్కుచుండెను.

ఆవిధాన జయప్రద నానా యవస్థలఁ గుడుచుచున్న కొలఁది దినముల కావర్తకుని యోడ లన్నియు సాగరంబున మునుంగుటయుఁ దస్కూలమున మితిలేని నష్టము చేకూఱు టయు సంభవించి యాయూరు విడిచి మఱల సోమపురిఁజేరె.

అక్కడి కేగినను ఋణదాతలు తమ ఋణము నొసంగుమని
నిరోధించుటచే నావర్తకుండు తనకుఁ గల యావదాస్తిని
ఋణదాతల స్వాధీన మొనర్చి వారి విక్రయించుకొని
తమ ఋణములఁ దీర్చుకొమ్మని వచియింప ఋణదాత లాతని
యాస్తిని రాజమందిరము ముంగటకుఁ గొనివచ్చి రాజాను
మతిని బహిరంగముగా విక్రయింపఁదొడంగిరి.

ఆయాస్తిలో జయప్రద వసించియున్న మందసముఁ
గూడ కలదు. ఆపెట్టెలోని వస్తువులఁ గూడ విక్రయింప
నాసవొడమి ఋణదాత లాపెట్టెఁ దెఱువనుద్యమించి వలను
గాక గత్యంతరమును గూర్చి యోచించుచున్నంత నేఁడగు
పురూరవుండు వచ్చి పేటికఁ దాను దెఱువనుంకించి దానిపైఁ
గరంబిడినంత నామూత విడివచ్చెను. అందుండి జయప్రద
వెడలి భర్త నానవాలుఁబెట్టి యాతలంబున నిలువ సిగ్గుపడి
రయంబునఁ గోటలోని కరుగుచుండెను.

వర్తకుని వ్యాపార మంతరించుటయు, నాతని యాస్తి
బహిరంగముగ విక్రయించుటయు నాయూర నందఱెఱింగిన
విషయమే యగుట నాప్రదర్శన విలోకనార్థమై యేతెంచిన
వారిలోఁ జెంగిపెంచిన బాలురుఁ గూడ కలరు. లోనికరుగు
చున్న జయప్రదను విలోకించి రాబాలురు. ఆయమ్మ తమ
తల్లియేమై యుండునని యాబాలు రిరువురుఁ దమలోఁ దాము
సంభాషించుకొనుచుఁ బురూరవుని వంకఁ జూచి "యీతఁడే

వ్వఁడై యుండునా”యని సందేహించుచుండ వారిరువురి సంభాషణ మాలించుచున్న పురూరవుండు “మీ రెవ”రని ప్రశ్నించి యాబాలుర వలన వారి వృత్తాంత మాద్యంతముగ నాలించి, మహదానందభరితుఁడై తన తనయులఁ గౌఁగిలించుకొని ముద్దాడి వారిరువురఁగొని రాజమందిరమున కరిగెను. జయప్రదను గనుఁగొనెను. నడచిన వృత్తాంతమంతయు నెఱిఁగెను.

దుర్మార్గుఁడై మహాసాధ్వి యగు తన భార్య యెడల మహాపచార మొనర్చిన యావర్తకుని రప్పించి యాగ్రహోదగ్రమానసుండై కరవాలంబుఁగొని కంఠంబు త్తరింప యత్నించినంత నావర్తకుండు తేనిపాదంబులపైఁ బడి శరణుజొచ్చెను. పురూరవునకు హృదయము మాఱినది. జాలివొడమినది. తగిన రీతి మందలించి వాని నావలికిఁ బంపెను.

పురూరవుండు చక్రవర్తియై యుండియు శనిమాయచే సకల యిడుమల ననుభవించుచు భార్యాపుత్రుల కెడమై దుర్భరదురంతచింతాహతి గ్రమ్మగ్గియున్నను తన సదాచారముల విడువక, శాంతిశమదమంబుల విడువక, దయాసత్యశౌచంబుల విడువక,పరమేశ్వరునామోచ్చారణమునువిడువక మెలంగుటచే వాని మనోపరిశీలన మంతటితోఁ జాలునని పరమేశ్వరుండు సంతృప్తిఁ జెందెను. శనిని శాంతచిత్తునిఁ గావించెను. క్రమ్మఱ సకలవిభవంబులఁ జేకూర్చెను. పురూరవుం డంములకు గర్వ,

తుఁడుగాక, తనయెడ నిర్దయుఁడై, కరచరణంబులఁ దెగఁ ్రేయ నను జ్ఞనొసంగిన ప్రభునికుమార్తె నే గాంధర్వవిధినిఁ బరిణయం బగుటచే నాయత్తమామలఁ దోడనే రావించి, తన జీవిత చారిత్రమును వారికెఱింగించి, వారి మన్ననలకుఁ బాత్రుఁ డయ్యెను. తన కుమారులు దిక్కులేక నేటియొడ్డునఁ జేరి విలపించెడి కాలంబున మాతృదేవియై సంరక్షించి పెద్దవాండ్రఁ గావించిన గొల్లచెంగిని, దన్నుమహాప్రవాహమునఁ గొట్టుకొని పోవుతరుణమున నుద్ధరించిన గొల్లలను రావించి వారలకుఁ దగిన పారితోషికంబుల నొసంగి వారి యభివందనములకుఁ బాత్రుఁడయ్యెను.

తోడనే తొల్లి తనరాజ్యంబుపై నెవ్వరుదండెత్తి తన్ను రాజ్యచ్యుతుని గావించిరో వారిపై మఱల దండువెడలి యా శత్రునిఁ బరాజితునిఁగావించి మఱలఁ దన సార్వభౌమత్వమును సంపాదించెను.

ఇమ్మహాత్ముని సద్గుణసంపదలకును, జయప్రదయొక్క పతివ్రతామాహాత్మ్యమునకును మెచ్చుకొని శివుండు స్వయముగావచ్చి యర్ఘ్యమన్ననలఁగొని యుచితవరంబుల నొసంగి వీరలఁ జిరకాలముఁ గీర్తియుతులఁగావించెను.

జయప్రదను సామాన్య వనితఁగాఁ దలంప వీలులేదు. పరోపకారార్థమై కూలిఁజేసి యావృత్తియందుండియుఁ దన

మహాన్యతను గాఁ బాడుకొనుచుఁ బతితో డిదియే లోకంబని విశ్వసించిమెలంగిన యీమెచరిత్ర మెవ్విధమునకుఁబత నార్హ మెవా వేఱుగాఁ జెప్పవలయునా ?

---

# 2. అనసూయ.

అత్రిమహర్షి సప్తమహర్షులలో నగ్రగణ్యుఁడు. సకల విద్యారహస్యకోవిదుఁడు. అన్నిశక్తులును వానియందిమిడి యున్నవి. ఇహసుఖంబుల విసర్జించి, యరిషడ్వర్గంబులఁ ద్యజించి, విజనారణ్యముల కరిగి, కేవలము వాయుభక్షకుఁడై నిష్కళవమగు పరబ్రహ్మస్వరూపమును గన్నుల కఱవుదీఱఁ గనుఁగొనిన మహాభాగుఁడు. అట్లయ్యును నాశ్రమచతుష్టయములో గృహస్థాశ్రమస్వీకారమే ధర్మమని యెఱింగినవాఁడుగానఁ దన కర్హురాలగు కన్య నన్వేషించుచు నందందుఁ దిరుగుచుండెను.

భగవంతుని స్వయముగాఁ గనుఁగొనిన మహాత్ముండు తన కనుకూలవతియగు భార్య నేఱికొనఁజాలఁడా? వెదుకఁగా, వెదుకఁగా, నొకచోఁ గనుఁగొనినాఁడు. ఆ యమ్మపై నత్రి మహర్షి దృష్టి పాఱినది.

అనసూయ సకల సుగుణాభిరామ. రూపమున రతీదేవిని మించెను. విద్యయందు సరస్వతీదేవిని వెనుకనుంచెను. శాంతమున భూదేవిని పాదములక్రింద నిల్పెను. బాలయయ్యును, యౌవనశీలయయ్యును, నేవిషయంబునందును, నేరును, జివఱకు త్రిమూర్తుల భార్యలును నామెకీడు రాకుండునటులఁ బ్రవర్తించుచుండెను. ఆ కన్యారత్న మా మహామునీయుని నేత్రములకెట్టి నిముసమందు సాక్షాత్కార మయ్యెనోగాని, యామెవలనఁ దన కీర్తిచంద్రికలు మునుపటికన్న దశదిశల నింక నెక్కుడుశోభతో వెలుంగఁగలవని విశ్వసించి, యత్రిమహర్షి యానాఁటి యాచారము ననుసరించి కన్య లస్వతంత్రలగుటచే నాబిడ తలిదండ్రులకడ కరిగి తన మనోభిప్రాయ మెఱింగింప వారు ద్వితీయ బ్రహ్మనాఁబఱఁగు మహర్షి తమ కల్లుఁడగుటకంటె మహాభాగ్యమున్నదా యని సంతసించి తోడనే శుభముహూర్తమును నిశ్చయించి తమ కూఁతును నమ్మహర్షికిచ్చి వివాహముఁ గావించిరి. నూతన వధూవరులయ్యు నా దంపతులు తమ పరస్పరానురాగాధిక్యతచే సకల సుఖంబులఁ బడయుచు నటనే కాలంబుఁ గడుపుచుండిరి.

(2)

అత్తవారింటనుండి భార్యతో నెన్నాళ్ళు సుఖముగాఁ గడుపఁగలఁ డత్రిమహర్షి? ఇదియేళ్ళు యుల్లతికపుపద్దా! అత్త-

వాని యాస్తిని సంక్రమింపఁజేసికొని తన్మూలమున జీవింప నమ్మహనీయుఁడు సిరీక్షించి యుండెనా? ఇటనున్నను నామ హర్షి తనకాలకృత్యముల మఱువలేదు. భార్యవలనఁదాను సకల సుఖములఁ బడయుచున్నను నంతమాత్రముచే నెక్కుడు వ్యామోహితుఁడుఁగాలేదు. ఇట్లుండఁగనే యొకనాఁడువాని హృదయంబునకుఁ బూర్వపుస్థితి తట్టినది. స్వీయాశ్రమముపై మమకారము హెచ్చినది. తానాస్థితియందుండుట హేయమని తోఁచినది. అటనుండి కదలుటయెట్లులనాయనెడి యాలోచన ములో మునింగెను. కాని యాయాలోచన మెన్నాళ్లని? చివఱకొకనాఁడు తెంపుఁజేసుకొని ప్రియసినిబిలిచి తన మనో భిప్రాయమును దెలుప నామె వానిప్రయాణమున కెట్టియడ్డం కులఁ గలుగఁజేయలేదుగాని తన్నువెంటఁ గొనిపోవుటను గూర్చి బలవంతపెట్టఁ దొడంగెను. సతుల కుండవలసిన సహజ లక్షణములఁగూర్చి ప్రబోధించెను. ఆవయస్సునకే, యొక మహనీయునిఁ జెట్టఁబట్టిన యాకొలఁది దినములకే స్త్రీజాతి కంతకు మకుటమనెడి విఖ్యాతినార్జించిన యమ్మహాసాధ్వి, యనసూయ, భర్తను స్వీయాశ్రమమున కొంటిఁగానంపి, తాను బుట్టినింట సుఖముగాఁ గాలక్షేపముసేయఁగలదా?

అత్రి మహర్షి మహాదారణ్యనివాసకష్టోదంతములఁ గూర్చి వివరించిచెప్పి యామెను విముఖురాలిఁ జేయ యత్నిం చెనుగాని వాని యుపన్యాస మామెకడ సార్థకముకాలేదు.

తనకట్టి యోగ్యురాలు భార్యయైనందుల కెంతయునుప్పొంగుచు శుభముహూర్తమును నిశ్చయించి యిల్లాలినివెంటఁగొని స్వీయాశ్రమమునకుఁ జేరెను.

(3)

ఆశ్రమవాసినియై, వన్యఫలంబుల నారగించుచుఁ, గావి గుడ్డలఁ గట్టుచు, ఘాతుకమృగంబులతో సహవాసముఁ జేయుచుఁ బతిమాటయే కొంగుబంగారమని, పతియేదైవంబని, పతిసేవనమే భావ్యసద్గతికి మూలమని, విశ్వసించి పాతివ్రత్య ధర్మముల కొక్కింతయేనిఁ గళంకము రానీకుండ మెలంగుచుఁ బతిమెప్పులకుఁ బాత్రురాలయ్యె. వానివలన మహత్తరములగు శక్తులనెన్నిఁటినో గ్రహించి త్రిమూర్తుల భార్యలకుసైతము వంకరలు దిద్దఁగలిగిన మహాసాధ్వి యయ్యెను.

ముల్లోకముల నెవ్వరయినను సరియే కీర్తిమంతులై తమయశోలతను నలుగడలఁ బ్రాకించుకొనుచున్నచో నేదియోయొక కథనుగల్పించి విచిత్రనాటక మొక్కండు ప్రదర్శించి తీరవలసినదే నారదుఁడు. యశోవంతుల మహత్తర చరిత్రలను లోకముల వ్యాప్తముఁజేయువాఁడు నీతఁడే. వారిని శల్యపరీక్షఁ జేయునదియు నీతఁడే. నారదుండు బ్రహ్మ మానసపుత్రుండు. త్రిలోక సంచారి. వాని సంచారమునకుఁ గాలనియామములు లేవు. చొఱరాని తావులేదు.

సకలజనులును దనలో మునింగి తమతమ పాపంబుల నుండి విడివడుటవలన వీరి పాపంబులన్నియుఁ దానుభరింపఁ జాలక గంగాదేవి తన్నుద్ధరింపఁగల మహనీయులెవ్వరా యని విచారించుచుండ నాకాశవాణి యొకనాఁ "డమ్మా! సకల కలుషమ్ములవమ్మొనరించు నీకుఁగలుష మేలనమ్మా? అయినను నీ యనుమానమును నివారించుకొన నుద్యమింతువేని నొక పతివ్రతను శరణమ్ము వేఁడు" మని సలహానొసంగెను. ఈ విషయము నారదుండు గ్రహించెను. పాపము! కలహమనునది లేక యెన్ని దినాలనుండి శుష్కించి పోవుచుండెనో?

లక్ష్మీదేవికిని, సరస్వతికిని, పార్వతికిని తమవంటి యిల్లాండ్రు లేరనియుఁ దమ భర్తలు తమ చేతులలోని కీలు బొమ్మలనియు గర్వము కలదు. ఆ గర్వంబును గనుఁగొన వలయును. అనసూయాదేవి సతీత్వమును ముల్లోకములఁ జాట వలయును. ఇది నారదునియూహ.

గంగామహాదేవి వైకుంఠమున కరిగి లక్ష్మీదేవిని, కైలాసమున కేగి పార్వతిని, సత్యలోకమునకు వెడలి సరస్వతిని శరణమ్ము వేఁడెను. వారుమ దమ శక్తికొలఁదిగ గంగయొక్క పాపములఁబోఁద్రోలఁ బ్రయత్నించిరి గాని విఫలమనోరథులైరి. ఇఁక శరణమొందుటకు లేమిఁజేసి యిక్కలిఁబొక్కుచు స్వస్థలంబున కరుగుచుండఁ ద్రోవ మధ్యంబున నారదుండెదురై "తల్లీ!

గంగాభవానీ ! నీకష్టోదంత మెఱుంగుదు. నీవు భూలోకమున
కరిగి మునికులతిలకుండగు నత్రిమహర్షి భార్య యనసూయను
శరణమ్ము వేఁడితివా, నీయాపద తొలఁగఁగలదు. అంతకన్న
నిన్నుఁగావ నెవ్వరును లే" రని సలహానొసంగ నాయమ్మ వాని
యాలోచనమున కెంతయు హర్షించి సత్వరంబుగ ననసూయను
గలిసినంతఁ బ్రాణనాథుని సేవయే యానపాత్రమని, యాత్మేశుని
ప్రబోధమే యాశాపాశములఁ ద్రుంచునని, ప్రాణనాథుని పద
పూజనమే ముక్తిసౌధముఁ జేరు సోపానమని విశ్వసించెడి
యనసూయ కరుణార్ద్రచిత్తయై తనకుఁ దన భర్త ప్రసాదించిన
మహత్తరశక్తివలన గంగామహాదేవి పాపంబులఁ బాపఁజాలుఁ
గావించి యాబిడకు ముదంబుఁగూర్చి వీడ్కొల్పెను.

నారదుం డూరకుండక వైకుంఠంబున నొకనాఁడు త్రిమూ
ర్తుల భార్యలొక్కచోఁ జేరి విలాసముగఁ బ్రొద్దులఁబుచ్చు
చున్న సమయంబున నటఁ జేరి ప్రసంగ వశంబుగా వారల
కనసూయాదేవి మహాత్మ్యమును గూర్చి కొండంతలుగఁ జేసి
వర్ణించి చెప్ప నామువ్వురును నారదుని వర్ణనమున కెంతయు
నసూయాపరులై తమ భర్తల సహాయముచే ననసూయసాధ్వీ
త్వమును కెట్టులేని హాని వాటిల్లఁ జేయవలయు నని సంకల్పించు
కొనిరి. ఎవరిస్థానంబులకు వారరిగి తమ మనోభీష్టముల భర్త
లకు విన్నవించిరి. వారును మహిమాంగనయగు ననసూయను
శోధించుట సామాన్యమైనపని కాదనియు, పట్టితలంపును మార్చు

కొమ్మనియుఁ దమ యిల్లాండ్రకు హితంబుఁగఁజెపిరిగాని వారు వినసందున ముయ్వురును ముందు కొనసాగించవలసిన విధానమును గూర్చి యొక కార్యక్రమ పట్టికను సిద్ధపఱచుకొనిరి.

ఇట్లుండ నొకనాఁడనసూయ తన భర్తృపాదముల నొత్తుచుండ నాతఁడు పతివ్రతా ధర్మంబులను గూర్చి యింక నామెకు హితంబులఁ గఱపుచుండెను. ఆసమయమున నే త్రిమూర్తుల కార్యక్రమ ప్రణాళిక ననుసరించి భృంగి క్షుద్బాధకులోనై యన్నంబు కొఱకు వచ్చి వాకిట నిలచి యాఱసుచుండ నాయఱపాలించి యనసూయ "అయ్యా! ఒక్క నిముస మాగుము. నానాథుని సేవఁ బూర్తిఁ గావించుకొని వచ్చి నీకన్నం బిడెద"నని పలుక నీశ్వరప్రేరణముచే నామెను శోధింపవచ్చినవాఁడుగాన దండితాడిత భుజంగంబుకరణి మండి పడుచు "నాయాకలికంటె నీనాథుని సేవ యెక్కువయా" యని కాలుఁగూతలఁ గూయుచు నొక భూతమును గల్పించి యామెపైఁ బ్రయోగింప నామె వీనిదురభిప్రాయ మెఱింగినదై వెంటనే యాభూతమునకుఁ దగురీతి బుద్ధిఁజెప్పె.ఆభూతముతోఁ బాటు భృంగికిని వణఁకుఁ బుట్టి యమ్మహాసాధ్విని శరణమ్ము వేఁడి, యాపె యనుగ్రహంబునకుఁ బాత్రుఁడై యత్తలంబు వాసెను గాని యాతఁ డంతటితో మిన్నకుండెనా? లేదు. పార్వతీదేవి ప్రోత్సాహమున నొక సర్పమును గైకొని వచ్చి షత్యుపచారముల నిర్వర్తించుకొని గాఢనిద్రాపరవశయై

యున్న యనసూయాదేవి మెడలో నైవ నామె మేల్కొని యావిషయము నెఱింగి తన శక్తి వలన నాపామును బూలహారముగామార్చివైచెను.

(4)

నర్మద పేరునఁ బిలువఁబడెడి యొక సాధ్వి తన సాధ్వీత్వమును నిలువఁబెట్టుకొనుచు భర్త కుష్ఠురోగియైనను, నంధుఁడైనను, నేవగించుకొనక భక్తితత్పరయై వాని సేవించుచుండె. ఇట్లుండ నొకప్పుడీనర్మద వికలాంగుఁడైన పెనిమిటిఁగొని తీర్థయాత్రలసేవించుచుండ నొకచో మాండవ్యుఁడు కొందఱు చోరులవలన బాధింపఁబడుచుండెను. నర్మద భర్తపేరు కౌశికుండు. ఆ సమయంబున కీకౌశికుం డటనుండుటచేఁ దనకుఁగలిగిన దురవస్థకీ కౌశికుండే కారణ భూతుఁడని తప్పఁదలచి ముందు వెనుకలఁ జూడక మాండవ్యుం డాకౌశికుని సూర్యోదయమయినంతనే మరణించునటుల శపించెను. నర్మద తమ నిర్దోషిత్వమును విన్నవించి మెట్టులేని నా శాపమును మఱలించుకొమ్మని మాండవ్యు నెంతయో బ్రతిమాలెను. లాభము లేక పోయెను. అందుచే నర్మద తన భర్తృప్రాణసంరక్షణము నిమిత్తమై తెల్లవాఱకుండునట్లుగనే సూర్యునకు ముదల నొసంగెను.

తత్కారణమున జగత్సంక్షోభ ముదయించినది. లోకములన్నియు నంధకారమయమే. దేవతలెల్లఱు గగ్గోలందిరి

ఎంతసేపునకును దెల్లవాఱదు. అంత వష్టదిక్పాలు రందులకు హేతు వేమైయుండునాయని యోచింపఁ జొచ్చిరిగాని యిది మిత్థమని నిర్ణయింపలేకుండిరి. ఇంతలో నారదుఁడాతలంబున సాక్షాత్కరించి సూర్యోదయము కాకుండుటకుఁగల కారణం బును దెలిపి నర్మదాదేవి కాళ్ళపైఁబడుమని సలహో నొసంగి నంత నింద్రుండు తానొంటిగాఁబోయిన నెటుఁబోయి యెలు వచ్చునోయని సంశయించి మహాసాధ్వియగు ననసూయకడ కరిగి యీ జగత్సంక్షోభ కారణమెఱింగించి, సహాయ మర్థింప ననసూయజాలిఁజెంది వానివెంటనే బయలుదేరి వెడలి నర్మదఁ గలిసికొని, యింద్రుని పక్షమున మాటలాడి తన మాహాత్మ్యమునవలన నర్మదాదేవిభర్త సజీవుఁడై యుండునటు లొనర్చి, నర్మదాదేవివలన సూర్యోదయ మగునటుల నాజ్ఞ నిప్పించి, దేవతల నుద్ధరించెను.

(5)

అనసూయాదేవియిట్టిమహత్తరకార్యము లనేకములుగా నొనర్చుచుండఁ ద్రిమూర్తులభార్యలకుఁ గన్నులు గుట్టుచునే యున్నవి. నారదుం డేనాఁటికానాఁడు వార్తలనందించు చునే యుండెను. వారలకుఁ గడుపుబ్బులు హెచ్చుచునే యుండెను. కలహభోజనంబును దాఁదృప్తిగాఁ గుడుచుచునే యుండెను. ఇప్పటికిఁ బార్వతీదేవియొక విధంబుగాఁ బరీభవ

మందినది. దేవేంద్రుఁడు తనపరివారముతోఁ గదలివచ్చి మహిమాంగనయగు ననసూయాదేవి సహాయముఁ బడసెను. ఇఁక లక్ష్మీదేవి తనవంతుఁ దీర్చుకొనవలెనని నిశ్చయించుకొని కుమారుండగు మన్మథునిరావించి యెట్టులేని ననసూయను బరిభవించిరాఁ బ్రబోధించెను.

మహాపురుషులను, మహిమాంగనలను నీవిధంబుగఁ బరిశోధించి పరిభవముల నందుటలో నీతండును గట్టివాఁడే యగుటఁ జేసి తల్లియాజ్ఞ శిరసావహించి నిముసములమీఁదఁ బ్రియమిత్రుఁడైన వసంతునిరావించి, తన యుద్యానమును నెఱిగించి వాని యామోదమునుబడసి, తపోవనంబున కరిగి మొన్నాళ్లకును రానిభర్తనుగూర్చి పరిపరివిధంబులఁ దలపోయుచు నాశ్రమప్రాంతమున భగవత్పూజార్థమై పుష్పములసేకరించుచున్న యనసూయపైఁ దనబాణములఁ బ్రయోగింపసాగెను. వసంతుఁడో యాయాశ్రమ ప్రాంతమును శోభాయమానముగ నలంకరించి సకలసువాసనల నొసంగుచుండెను. ఈసువాసనలకును, దనకుఁ గలుగుచున్న మన్మథవికారమునకును నాశ్చర్యమంది, తనహృదయ మట్లుండుటకుఁ గారణములనరయుచుండ మన్మథుఁ డతిప్రవేశము దాల్చి యామెఁ గవయనుంకించినంత నామెతనశక్తివలన నాకుత్రిమము నెఱింగి మన్మథునియంధునిగా శపించె. వెంటనే మన్మథుఁడు కన్నులుగానరాక ననసూయాదేవి పాదములపైఁ బడి "తల్లి

మహాపరాధిని, భవదీయ మాహాత్మ్య. మె ఱుంగక నితరుల ప్రేరేపణముచే నిటుల వచ్చియున్నాఁడ. పరమసాధ్వి వగు నీకిట్టి దీర్ఘకోపంబు సనదు. నీవు సిక్కముగ నలిగినచో నీముందుఁ ద్రిమూర్తులేని నిలువ నర్హులగుదురా ? అమ్మా! నన్నుఁ గరుణింపుము. నానేత్రముల నా కొసంగుము. నీయట్టి వారి దర్శన మొనర్చుకొనుచు, నికఁ నెట్టి యవకతవక కార్యముల దెసఁబోక, బుద్ధిఁగలిగి ప్రవర్తించెద"నని ప్రబతిమాల నామె యెట్టెట్టులో జాలిఁగని "ఓయీ! నీవు లక్ష్మీనారాయణులకుఁ బుత్త్రుఁడ వగుటఁ జేసియు, రతీదేవి మాంగల్యమిఁక గట్టిగా నుండుటనుబట్టియు, నిన్ను మన్నింపక తప్పినది కాదు. ఇంతటితో వదలితి. జాగరూకుఁడవై మెలంగు" మని హితంబుఁ గఱపి యావలకంపెను. లక్ష్మీదేవి పరీక్షకూడ యింతటితో ముగిసినది.

ఒకనాఁడొకయాఁడుది బిడ్డలఁ జంక నిడుకొనిమధుకరంబునకైవచ్చిన ననసూయాదేవి యాబిడ్డలఁ గాంచి యానందించి వారాకలిబాధచే నేడ్చుట కెంతయు జాలిఁజెంది వారి క్షుత్తుఁ దీర్చి పంపె. నాఁటఁగోలెఁ దానుఁ గూడ నట్టి పిల్లలఁ గనిపెంచవలయుననెడియాశఁగలిగి నిరంతర మందులకై యారాటపడుచు దగిన సమయముఁ జూచి పెనిమిటితోఁ దన మనోభీష్ట మెఱిఁగించెను. విఱుపు మాటలచే సతులు తమ పతుల వేఁపుకన్నఁ

బతులు సతుల కోరిక లర్హము లైనచోఁ దప్పక వాని నాచర ణమందుంచుదురు.

తనయిల్లాలి కట్టికోరిక యున్నదని యెఱింగి తోడనే మహానుభావుండగు నత్రి బదరికావనంబున కరిగి జగద్రక్షకుండును; భక్తత్రాణపరాయణుండును, బ్రణతార్తిహరుండును, నాదిమధ్యాంతరహితుండును నగు శ్రీమన్నారాయణునిఁ గూర్చి తపంబొనర్ప నాయాదిదేవుండు గరుడవాహనారూఢుఁడై సాక్షాత్కరించి "యోమునికుల సార్వభౌమా! నీతపంబున కేనెంతయుమెచ్చితి. నేను నీకు నందనుఁడనై జన్మించి నీవనపత్యుఁడవనెడి యపనిందఁ బాపెద"నని యభయంబొసంగి తిరోహితుండయ్యెను.

(8)

మఱల లక్ష్మీదేవియు, పార్వతియు సరస్వతియు నొక్కచోఁ జేరిరి. లక్ష్మీదేవియుఁ బార్వతియుఁ దాము పడిన పాటులనెల్లఁ దలంచుకొని ముందు జరుగవలసిన కార్యమును గూర్చి యోచింపసాగిరి. సరస్వతీదేవి, "అక్కలారా! మనవారిందునఁగూర్చి తేపోమాపో వెడలనున్నారు. ఆ యమ్మ సతీత్వమును బరిశోధింపఁ బట్టుఁ బట్టియేయున్నారు. అందులకై మనకీవిచార మేల"నని వారి నూరడించెను. భర్తలపరిశోధనాలితముల నిరీక్షించియున్నారీముప్వురును.

ఇట్లుండఁ ద్రిమూర్తు లొకచోటఁ జేరిరి. విష్ణుమూర్తి "దేవతలారా ! మన మొనర్పఁబోవు కార్యము నలువురు నవ్వునది. ఆఁడువారి మాటవిని జగద్భద్రసంధాయకులుఁ గూడ తమ గౌరవములను బూదిలోఁ గల్పిరనెడి యపఖ్యాతిఁ బొందఁగలము. మామాటకి నమ్ముఁ"డని హితంబుఁ గఱపెను గాని, మహేశ్వరునకును, పితామహునకును, నాహితంబులు రుచింపక పోవుటచేతను, దానత్రిమహర్షి కొసంగినవరంబును సార్థక మొనరింపవలసి యుండుటచేతను, వారి యాలోచన మునకే విష్ణుమూర్తియు లొంగిపోయెను. ముగ్వురును ముని వేషముల ధరించి యత్ర్యాశ్రమమునకై బయలుదేరిరి. దారిలో నారదుండెదురై యనసూయను బరిభవింపవలదని నివారించెను. విష్ణుమూర్తి "నారదా ! ఈ కార్యంబు దూష్య మని మేమెఱింగియు నామె సతీత్వమును లోకమునఁ బ్రచార మొనర్చుటకే యిటులఁ జేయుచుంటి"మని వాని సమాధానఁ పఱచి పంపెను.

(9)

ఆశ్రమంబున ననసూయ యొంటరిగఁ గూర్చుండి "బదరికావనంబునఁ దపంబొనర్ప వెడలిన మన్నాథుండింతకా లము రాకుండుట కేమి హేతువో ? వానియెడ భగవంతుఁడు ప్రసన్నుఁడయ్యెనో లేదోగదా ? ఆపరాత్పరునకు నాపైనేలఁ

గరుణారా"దని తనలోఁ దా నేమిగనో వితర్కించుకొనుచున్న సమయంబునకే త్రిమూర్తులు ప్రచ్ఛన్నవేషధరులై యట సాక్షాత్కరించి "భవతి భిక్షాందేహి" యని యర్థించిరి.

ఆ త్రిమూర్తుల రూపములఁగని యాశ్చర్యపడియు నసూయ యట్టి మహనీయుల కతిథిపూజల కొంతయు నానందించుచు వెంటనే లోనికాహ్వానముఁ జేసి వారలకుఁగొన్ని ఫలంబులఁ దెచ్చియిచ్చి [illegible] సిద్ధపడియెను. విష్ణుమూర్తి "సుదతీ! ఆగుము. మాకున్నవ్రతముఁ దెల్పెదము కొనక మేమెట్టుల భుజియింపఁగల"మనె "మహామహులారా! మీవ్రతమెట్టిదియో యెఱింగించిన సంతసింతు"నని యనసూయ మఱలఁబ్రశ్నింప శంకరుఁడు "అనసూయా! మఱేమియు లేదు. నీవు విగతవస్త్రవై మాకాహారసనము వడ్డింపుమన" ననామె "సదయాంతఃకరణులారా! ఇట్టికోరిక విపరీతము గదా. మున్నెన్నఁడెఱుంగనిది. మానవతుల మానంబులఁ గాఁపాడవలసినవారే యిట్టివ్రతమున కుపక్రమింప నికలోకము లున్నవే" యని హితమువచించెను. వారామాటలఁ జెవిఁ బెట్టక తమ వ్రతముఁ జెల్లింపక తప్పదని పట్టుఁబట్టిరి.

ఆయమ్మయునిదియెల్లఁ బరమేశ్వరుని మాయగా నెఱింగి మనంబున గాఢముగఁ బతినిస్మరియించుకొని "యార్యులారా! మీకోరిక నేనేలఁ గాదనవలయు నట్లనే నొనర్తు. మీరు మీకాంక్షిత

ములపై నాసీనులుగఁ"డని పలికి వారిపై మంత్రోదకములఁ
జల్లినంత వారు ముప్పురుఁబసిబాలు రగుటచే ననసూయ విగత
వస్త్రయై వారికి స్తన్యమొసంగుచు లాలించుచుండెను.

ఆ యమయంతటితో మిన్నకుండలేదు. వారికొఱకై యు
య్యాలలఁగల్పించి యందుఁబరుండఁబెట్టి జోలపాటలఁబాడుచు
దినంబులు గడుపుచుండెను.

(10)

అనసూయ తత్వమును బరీక్షింప వెడలిన తమభర్త
లెంతకాలమువఱకును రాకుండుటచే వారిదేవేరులు ముప్పురు
నొక్కచోఁజేరి తమలోఁ దా మారాటపడఁ జొచ్చిరి. ఆసమ
యమునకే నారదమహాశయుండు శుభవార్తమానముఁ జెప్ప
వచ్చెను. నారదునిఁజూచినంతనే లక్ష్మీదేవి గర్వముతో
"నారదా ? అనసూయకికఁ గావలసినంత శృంగభంగము.
ఆ యమ్మనుగూర్చి యేమేమో పొగడితివే ? ఆ పొగడ్త
లన్నియు నేమి కాఁగలవో చూడు"మని పలికినంత శతానంద
నందనుఁ "డమ్మా ! అనసూయ మాటకేమికాని మీ పతుల
గతులేమైనవో యెఱుంగుదురా ? శిశువులై, యాయమ్మపాలఁ
ద్రావుచు నుయ్యెలలఁజేరి హాయిగా నిదురఁబోవుచున్నారు.
అదికాదమ్మా ! మీ భర్తలకామె విగతవస్త్రయై వడ్డన
మొనర్పవలయునా? ఇదియా మహాసాధ్వులఁ బరిశోధింప

వలసిన విధాన ? " మని తెలుపుచుఁ గనుపుబ్బ నవ్వసాగెను. వీనినవ్వులఁ జూచుచున్న కొలఁదియు నా దేవతల కాతురము హెచ్చగుచున్నది. దిగులు పుట్టుచున్నది. "నారదా ! ఇది యేమి విపరీతవార్త ? నీ పలుకులు నిజములై యుండునా" యని ప్రశ్నలపైఁ బ్రశ్నల వర్షింపఁజేసిరి. అతఁడు తననవ్వ నాపుకొనఁజాలక "నవ్వనమ్మలారా ! నా పలుకులు వాస్తవములు. ఏల మీ రారాట పడియెదరు ? మఱలఁ జన్ని మగలఁ గట్టుకొని కులుకవచ్చును. అంతఁదనుక నోపికఁ బట్టుఁడు. మీ ప్రాణేశ్వరులకుఁ బ్రాణోపద్రవము కలుగ లే"దని సమాధాన మొసంగె. వానిఁ పరిహాసములు హెచ్చగుచున్న కొలఁదియు వారి విచారమును హెరుఁగుచుండుటచే గత్యం తరముఁగూర్చి ప్రశ్నించిరి. మేమే యోడితిమని యొప్ప కొనిరి. వెనుకటిమాటల జ్ఞప్తికిఁదెచ్చి చెప్పవలదని వానిఁ బ్రాల్మాలిరి.

ఇఁక వారి నేడిపించిన లాభము లేదని బ్రహ్మతనయుం "డమ్మలారా ! నేఁ జెప్పినటులఁ జేయుఁడు. వైశింబ ననసూయ కడకుఁ బరువెత్తుఁడు. ఆ యమ్మ పాదములపైఁ బడుఁడు. పతిభిక్షఁ బెట్టుమని ప్రార్థింపుఁడు. తమ తప్పుల క్షమింపుమని వేఁడుఁడు. ఇంతకంటె గత్యంతరము లే"దని పలుకఁజెప్పి తన దారిని దా వెడలిపోయెను.

(11)

తపంబునకేగిన యత్రి యింటికి వచ్చులోపలనే యీ-
విచిత్రసంఘటనము జరిగినది. అత్రి తన భార్యవలన నడచిన
వృత్తాంతమంతయు నాలించెను. త్రిమూర్తులే యతిథులైరని
గ్రహించెను. భగవత్ప్రసాద మివ్విధంబుగ లభియించినందుల
కెంతయు నుప్పొంగెను. ఈ వృత్తాంతమును నిముస నిముసము-
నా దంపతులు చెప్పుకొనుచు వారిలోవారు మహానంద
భరితులై యుండిరి. ఇంతలోఁ గొంత దవ్వుననుండి "భిక్షు"
మని నాదము వినవచ్చెను. ఆధ్వని స్త్రీలదేయని గ్రహించి
నాఁడత్రిమహాముని. ఇంతలో ననసూయ వారెవరో కనుఁగొన
వలయునని బయటకు వచ్చి చూచుసరికి నట సరస్వతియుఁ,
బార్వతియు, లక్ష్మీదేవియుఁ గాన్పించిరి. వాని వెనుకనే నార
దుండును గలఁడు. అనసూయ భక్తిపూర్వకముగా నారదునకు
నమస్కరించి "మహాత్మా! వీరెవ్వ" రని ప్రశ్నింప, నార
దుండు నవ్వుచు "నమ్మా! నీ పాత్రికలఁ జేరి పోషింపఁబడుచున్న
వారి భార్యలు. వీరి రాక నే నిప్పుడే యెఱింగితిని. ఇంతకును
నీవే గెలిచితివి కదా?" యన నామె "మహానుభావా! నేను
గెలుచు టేమి? ఓడు టేమి? నాకిదంతయు విపరీతముగా
నున్నదే" యన నారదుం డామెకుఁ దనకును, నా దేవేరులకును
జరిగిన సంభాషణముఁ గూర్చి సవిస్తరముగా నెఱింగించెను.
పతిభిక్షఁ బెట్టుమని వేఁడెదరు త్రిమూర్తుల భార్యలు. నాపుత్రుల

విడువఁగల్గుదునా యని ప్రత్యుత్తర మొసంగుచున్నది యన సూయ. ఈ సందర్భమున నాకాశవాణి పనిఁ గల్పించుకొని "యమ్మా! అనసూయాదేవీ! త్రిమూర్తులు లేనిచో జగంబు లొక్క గడియయేని నిలువఁజాలవు. నీ కీముప్పుర యాకృతు లచే దత్తాత్రేయుండ నెడి కుమారుండొకండు నీకుఁ గలుగును. ఇంతట వారి భర్తల వారి కొసంగు" మని తగవుఁ దీర్చినంత ననసూయా దేవి మాఱుమాటాడఁజాలకనట్లొనర్చెను. వారును దమ గండము గడచినందుల కెంతయు సంతసించిరి. నారదుం డామె ప్రభావమును మఱియొక విధముగాఁ బ్రదర్శింపఁజేయ నెంచి యనసూయ దెసఁ జూచి "తల్లీ! నా కాఁకలి యగు చున్నది. నీ కేమియుఁగష్టమొసంగను. ఏపదార్థమును దెచ్చి యిమ్మని వేఁడను. నా వెంటఁ గొన్ని గులకరాళ్లఁ దెచ్చుకొంటిని. వానిని బచనమొనర్చి యిచ్చితివా! నా యాకలిఁ దీర్చు కొందు" నని వేఁడ నా విపరీతపు కోరిక కటఁగలవారెల్ల నాశ్చర్యనిమగ్నులై, అయిన నా చోద్యమేమియో చూత మని నిరీక్షించిరి.

ఇన్ని దినంబులనుండి యా మహిమాంగనతో సంసార మొనర్చుచున్న యత్రిమహర్షి కే నారదుని వేఁడికోలబ్బురమ్ముఁ దోఁపఁజేయ మిగతవారినిగూర్చి మనము విచారింప నేల? నారదుం డేటిదో పరిహాసము లాడుచుండెనని భ్రాంతిచే

ననసూయాదేవి "నారదమునిచంద్రమా ! తెచ్చిన గులక రాళ్లేవి ?" యన నాతఁడారాళ్ల నామెచేతి ను. వెంటనే యా గులకరాళ్లే మెత్తఁబడియెను.

ఈ వింత ప్రదర్శనమును జూచి త్రిమూర్తులును, వారి దేవేరులును, నత్రియు మహదానందభరితులైరి. వారినందఱ నత్రియు, వాని భార్యయుఁ దగురీతి నాదరించి వీడ్కొల్పిరి. కొలఁది దినంబులకే యీయమ్మకు దత్తాత్రేయుఁ డనెడి నందనుఁ డుదయించెను.

(12)

ఇట్టి మహత్తరములగు శక్తులనార్జించి దిగంతవిశ్రాంత యశోవిశాలయై యనసూయాదేవి ముల్లోకములందును గీర్తిం పఁబడుచున్న కొంతకాలమునకు శ్రీరామచంద్రుండు పిన యమ్మ ప్రేరణంబున నిల్లాలితోడను, సోదరుని తోడను దండ కారణ్యమున కేగునప్పుడు త్రోవమధ్యంబున నత్రిమహర్షి యాహ్వానముపై వానియాశ్రమమున నిలువ జానకీదేవి సుగుణసంపదకెంతయు నచ్చెరువంది యామహాసాధ్వికిఁ గాను కగా నంగరాగము నొసంగి కొన్ని మాల్యములును, వస్త్రాభర ణంబులును సమర్పించి మహదాశీర్వచనములతో సత్కరించి వీడ్కొల్పెను.

లోకజననియనఁ బఱఁగు సీతాదేవికే యీమె యాశీ ర్వాదముల నొసంగునంతటి ప్రజ్ఞాన్విత యగుటకుఁ గారణ

మేమన ననసూయ తనకుఁగొమరుండై యుద్భవించిన దత్తా
త్రేయునివలన జ్ఞానయోగము నుపదేశమంది మోక్షపదవి
గమించుటకై భగీరథీతీరంబునఁ బదివేల వత్సరంబులు
మహోగ్ర తపంబొనర్చుటగు.

సీతాసతికిఁ దానుజేసిన సత్కారములతోడను, సమ
ర్పించుకొనిన యాశీర్వాదములతోడను తృప్తిఁజెందక, నన
సూయాసతి "తల్లీ! సీతాదేవీ! నీవు ముల్లోకములకును మాతృ
దేవి వగుటచే సాధ్వీలక్షణముల నెక్కుడుగాఁ దెలుపఁ బని
లేకున్నను నీకు జననివంటిదాననగునేను, నీ శ్రేయంబును
గోరిన నేను నాకుఁ దోఁచిన హితంబుఁ గఱపెద. భర్త దివ్య
సౌధాంతరముల వసియించినను, మహాదారణ్యములోఁ గాపుర
మున్నను, ధనికుఁడైనను, నిరుపేదయైనను, సజ్జనుఁడైనను,
దుర్జనుఁడైనను సొగసుకాఁడైనను, కురూపియైనను, నారోగ్య
వంతుఁడైనను, రోగియైనను, బతినే దైవంబనినమ్మికొని, సదా
వారినే వెన్నంటియుండి, వారికే సకలశుశ్రూషల నొనర్చి నటిం
చినచో నయ్యది సద్గతికిమూలము. అట్టిగతినే నమ్మికొని నేను
మెలంగుచున్నదాన. నావలెనే నీవును సంచరింపు" మని
హితంబుఁ గఱపెను.

అనసూయాదేవి తనపవిత్రవర్తనముచేఁ, దనవిజ్ఞాన మహి
మచేఁ, దన పాతివ్రత్యమహిమచేఁ, ద్రిమూర్తులంతవారికే

తగినప్రయత్నమొనర్చి, వారిదేవేరులకుఁ బతిభిక్షఁబెట్టి శ్రీమహావిష్ణువును దనకుమారునిగఁ గావించుకొని, దశరాత్రముల నేకరాత్రముగఁజేసి, లక్ష్మీస్వరూపురాలగు సీతాసతికి హితంబుగఁ గఱపి తనమహోత్తరజీవిత చారిత్రమును, చిరకాల సువాసినీత్వమును లోకమునకుఁ జాటుచుండ నాయమ్మచరిత్రమును బఠించినవారు సకలవిధముల ధన్యులగుదురని నమ్ముటలో విపరీతమేముండును?

---

# 3. స తీ తు ల సి.

తులసీదేవి కాలనేమి యను వాని కూఁతురు. విష్ణుభక్తురాలు. సుదాముఁ డనువాఁడును విష్ణుభక్తుఁడే గాని తులసీదేవి రూపరేఖావిలాసంబుల నిత్యంబును జూచుచున్నవాఁడగుటచే నామెపై మరులుఁ గొని యెట్టులేని నామెను దనకు వశ్యురాలిఁ గావించుకొనవలెనని నిశ్చయించుకొనెను అందులకై వలయు సన్నాహములఁ జేయుచుండెను. ఒక్కనాఁడొంటరిగఁ జిక్కిన తులసీదేవిని దనతోఁ గలియుమని నిరోధింప నా తలోదరి పరవనితాసాంగత్యము వలనఁ గలుగు మహాపాతకమును గూర్చి చాలవఱకు బోధించి చూచెను. గాని యాతఁడు బోధలన్నియు నాతని మెనసు సుకుచరింపనందునను, బలాత్కా-

రమెక్కువైనందునను దులసీదేవి శ్రీహరినిమనసారఁ బ్రార్థించి
నంత శ్రియఃపతి తోడనే యటఁ బ్రత్యక్షమై సుదాముని దాన
వునిగాఁ బుట్టుమని శపియించెను.

“పరమభాగవతోత్తముఁడనై, రాగద్వేషుఁడనైయింత-
వఱ కెనలేని ఖ్యాతి నార్జించి నేఁటి కిట్టిదురవస్థఁ దెచ్చి పెట్టు
కొని శ్రీహరి యాగ్రహమునకుఁ బాలైతినే” యని పెల్లున
దుఃఖించి శ్రీపతి పదారవిందంబులపైఁ బడి శరణంబు వేఁడి
నంత నాపరాత్పరుండు “సుదామా! శాపమును మార్చుట
కెంతమాత్రమును వీలులేదు. బదరికావనంబున కరిగి గరళ
కంఠుని గూర్చి యుగ్రతపంబొనర్చితివేని నాతండు నిన్నుఁ గరు
ణించి వరంబొసంగును. తన్మూలమున నీకీశాపము వాయును.
పొ”మ్మని సమాధానపఱచి పంపి తన దారిఁ దా వెడలి
పోయెను. తులసీదేవియుఁ దన యోషధ గడచినందుల కెంతయు
సంతసించెను.

(2)

సుదాముండు శ్రీహరియానతి మేఱకుబదరికావనంబునఁ
దపంబొనర్చుచుండఁ దన సహజవైరియును, రాక్షసకుల
ప్రభుండును నగు దంభుఁడే యీతఁడని భ్రమించి శక్రుండు
రోషకషాయిత నేత్రుండై యత్తలంబునకు వచ్చి తన వజ్రా
యుధముచే నిష్కారణముగాఁ నాతని కంఠ ముత్తరించెను.

ఇంతలో నారదుం డటకేతెంచి మహేంద్రుఁడొనర్చిన దుష్కా-
ర్యమున కెంతయు నాగ్రహించి, యా తపంబొనర్చెడివాఁడు
దంభుండుకాఁడని యెఱింగించి దంభుండున్న తలం బెఱింగించెను.

తన్నుఁగూర్చి తపంబొనర్చుచున్న భక్తుని నిష్కార
ణముగఁ దన వజ్రాయుధమున కెఱఁజేయునే యనెడి యాగ్ర
హంబున నింద్రుని శిక్షింప నిటలాక్షుం డా ప్రదేశమునకు
వచ్చుచుండఁ బితామహుండును, బార్వతియు వారింపఁజొచ్చిరి.
ఈపరిస్థితుల నెఱింగిన నారదుం డింద్రునితో “శచీధవా!
నీదుష్కృత్యమును శంకరుండు క్షమియింపఁజాలఁడు. నిముస
ములలోఁద వానికడ కరిగి శరణమ్ము వేఁడుము. బ్రహ్మాదులు
నీపై జాలిఁగొని వారించుచుండుటచే నాతండింతవఱకైన నిన్ను
క్షమించినాఁడు. పో” మ్మన నింద్రుఁడు గడగడ వడంకుచుఁ
బోయి గిరిజామనోహరుని శరణమ్ము వేఁడినంత నాతం డెట్ట
కేలకుఁ గరుణించెను. కాని యింద్రునికొఱకై విడిచిన యగ్ని
జ్వాల యెంతకును జల్లారకుంటచే నారదాదులందువలన మహా
ప్రళయము సంభవింపఁగలదని భీతిలి శివుని మెట్టి యాపద
రాకుండ నుద్ధరింపుమని యర్థించిరి. శివుండు వారి మొఱ
నాలించి యాజ్వాలను సంద్రంబునఁ బడవైచుచు దానట్లొ
నర్చుటకుఁగల రహస్యంబు నారదుని చెవిలో నూఁదెను.

(3)

ఇంద్రున కాజన్మద్వేషియగు దంభుండు సంతానముం కోఱునై బదరికావనంబునఁ దపంబొనర్చుచున్నను రాక్షసకుల గురుండగు శుక్రునివలన నింద్రుని యుదంతము నెఱింగి ప్రాణ సంరక్షణార్థమై బలిపురంబునకు వెడలి గండము గడచినందులకు సంతసించుచున్నను, తపఃఫలము చేకూఱనందులకు విచారపడు చునే యుండెను.

శివుండు జలరాసియందు విడిచిన యగ్నిజ్వాలామాహాత్మ్యము నారదుండెఱుంగును. కాన నష్టదిక్పాలకులతో నొకయద్భుతముఁ జూపెదరమ్మని పలికి వారినందఱివెంటఁగొని సముద్రతీరంబునకుఁ జేరినంత సూర్యప్రభతో వెలుఁగొందుచు నొకశిశు వేర్మైన నెత్తుకొమ్మని చేతులఁ జాపుకొని తీరము వంకకు వచ్చుచుండెను.

నారదుని ప్రోత్సాహంబున నందఱును తమతమ చేతులఁజాచి యబ్బాలు నెత్తుకొన యత్నించిరిగాని నందఱిఁగని యబ్బాలుండు పట పటఁ బండ్లుగొఱుకుచుండునేగాని వారి యాహ్వాన మంగీకరింపఁడయ్యె. చివఱకు నారదుండు చేయిఁ జాపినంత నబ్బాలుండు చిరునవ్వునవ్వుచు వాని యాహ్వాన మంగీకరించెను. దిక్పాలు రప్పుడయినను దమకొకముద్దేనినిచ్చు నేమోయని యాశపడిరిగాని యాయాశయు నిరాశయయ్యెను.

మీఁదు మిక్కిలి నబ్బాలుండు వారియెడఁ జూపిన తీక్ష్ణదృష్టికి భయపడి యీకుఱ్ఱండు పెఱిఁగినచోఁ దమ్మందఱను మట్టుఁబెట్టునని శంకించి వాని నప్పుడే త్రుంపివేయ సమకట్టిరి గాని నారద హితోపదేశము ననుసరించి యా బాలుండు నీలకంఠుని జ్వాలవలన బుట్టినవాఁడుఁగా నెఱింగి విడిచిపెట్టిరి. జలోద్భవుఁ డగుటచే నా బాలునకు నారదుండు జలంధరుఁడని పేరుఁబెట్టి దండధరున కొసంగి తిరస్కరణీ ప్రభావముచే బలిపురంబుననున్న దంభునికొసంగి పెమ్మని యాజ్ఞాపింప నాతం డట్లొనర్చెను. ఇట్లు యాదిపరమేశ్వరునిగూర్చి తపంబొనర్చిన దాని ఫలితము గదాయని దంభుండెంతయు సంతసించి యా బాలు నల్లారు ముద్దుగాఁ బెంచి పెద్దవానిఁ జేసెను. జలంధరుఁడు పెద్దవాఁడైన నాఁటఁ గోలె బుద్ధులును, విపరీతమయ్యెను. మహోగ్రమగు తపంబొనర్చెను. వరముల ననేకములఁ బడసెను. అందుచే నతిగర్విష్ఠుఁడై మెలంగు చుండెను. త్రిదివ మాక్రమింప నుత్సహించుచుండెను. దేవతల కందఱ కడలు హెచ్చుచుండెను.

(4)

మన కథానాయకురాలగు తులసీదేవి చిన్నటనాఁట నుండియు సుగుణాలవాలయగుటఁ జేసియు రూపమునఁ త్రి లోక సుందరియని యనిపించుకొనుటఁ జేసియు జలంధరుఁడీ

కన్య నెట్లయిన వివాహమాడవలెననెడి తలంపున నుండెను. తులసీదేవియుఁ దన కనుకూలుఁడైన పతి యాతఁడేయని యువ్విళ్ళూరుచుండెను. జలంధరుండు తనప్రజ్ఞాతిశయములచే బలిపురి బున నుండ నిచ్చగింపక విశ్వకర్మచే జలంధరమను పేరఁ బఱఁగు నొకపట్టణంబును నిర్మింపఁజేసి యట వసియించుచుండెను. పెద్దలు నలువురును జలంధరునకే తులసీదేవినిచ్చి వివాహము సేయవలెనని పట్టుఁబట్టిరి. త్రిదివసామ్రాజ్యాధిపతినని యనిపించుకొనిన యనంతరముఁ గాని పరిణయముఁ జేసికొననని పట్టుఁబట్టియుఁ జివఱకుఁ బెద్దల బలవంత మెక్కుడైనందున జలంధరుఁడు వివాహమునకు సమ్మతించెను. కాలనేమి సకల సన్నాహము లొనర్చుకొని తనయను వెంటఁ గొనివచ్చెను. జలంధరుని మెడలో నైచుటకొకపూల హారమును గాలనేమి తిన తనయకొసంగెను.

కులాచార్యుండగు శుక్రుని యాజ్ఞ నొఁదలధరించి తులసీదేవి సిగ్గునఁ దలవంచుకొని, చేతనున్న వకుళమాల జలంధరుని కంఠసీమనర్పించుచుండఁ బ్రమాదవశముచేఁ గ్రిందబడియెను. జలంధరుఁ డుగ్రమానసుండయ్యెను. ఇష్టములేని కన్నెను దెచ్చి తన కెందుల కర్పించిరని వారి వీరిదూషించెను. పాపము! మహాసాధ్వియగు తులసి జరిగిన ప్రమాదమున కెంతయు భయముఁ జెందుచుండెను. అటఁగలవారెల్లరును నదృష్ట ప్రమాద జనితమని తీర్మానించిరి. అయిన నకార్య

ర్యమమాగళపఱిదంబని జలంధరుఁడు భీష్మించెను. తన యభాగ్యతను దూరుకొనుచుఁ దులసీదేవి చింతించుచుండెను. ఇఁకనట నిలిచిన సభాసదుల బలవంతము హెచ్చగునని జలంధరుఁడు మఱియొక చోటికిఁ బోవ నుద్యమించినంత నారదుండు వాని నాపి, తగురీతి మందలించి మఱల నాతలోదరిచేఁ బూలహారమర్పింపఁజేయ నలుగడలనుండి విజయధ్వనులు చెలరేగెను.

[5]

వివాహమైనంతనే సంతసమా? ఒకరిపై నొకరి కనురాగముండవలయును. ఐకమత్యముండవలయును. ఇందులోనేది లేకున్నను, నెవరికి లేకున్నను నాదాంపత్యము రవ్వలపాలే యగును. తులసీదేవి కాతనిపై గాఢానురాగమున్నది. సకల శుశ్రూషల నొనర్పవలెనని యున్నది. వాని యనురాగమునకుఁ బాత్రురాలు గావలెనని యాశయున్నది. పరమసాధ్వులలో నొక్కతె నని యనుపించుకొన నుత్సాహమున్నది. పతి యెంత కంటగించుకొను చున్నను, విదిలించుచున్నను, దూషించుచున్నను, వాని యనుగ్రహ మేనాఁటికైన లభింపకుండునా యని నిత్యంబును సర్వాలంకారపరిశోభితయై భర్తకిష్టమైన వస్తువులని తాను భ్రమించినవన్నిఁటి సమకూర్చుకొని భర్తను సుఖపెట్టవలయునని వానిసన్నిధికరుగును. వానివలనఁదిరస్కృతులనందును. ఈ విధముగాఁ గొన్నాళ్ళు జరుగఁగా నామె యాశకు ఫలితముగా నామెకు భర్తతో శాశ్వతమైనయెడఁబా

ేర్పడినది. పతిసముద్రమున నొక ఖరీదైన నుంటుం కిను వేర్పడలేదు. బలిపురంబునకేగి మాతామహుని యింటం బడి యుండవలసి వచ్చినది.

సుజనపోషకుండగు పరాత్పరుని యనుగ్రహము తన యెడల నావిధముగాం బరిణమించుచున్నందులకును, దనకాపుర మతాచంద మైనందులకును దుఃఖించుచు శ్రీయఃపతిని మనంబున ధ్యానించుకొనుటతప్ప నామె కితరచింతనము లేదు. ఇట్లుండఁగా నారదుం డొకనాఁడు త్రిదివమునకరిగి మహేంద్రునిఁ జూచి తులసీదేవి పాతివ్రత్యమును గూర్చియు, నందచందములం గూర్చియుఁ దన పాండిత్యప్రకర్షణముఁ బ్రయోగించుచు, బొగడుచుండ బిడౌజుఁడామెను గనుఁగొన నువ్విళ్లూరుచుం డెను. ఆమె సతీత్వమును శోధింపనుత్సాహపడుచుండెను.

సౌందర్యవనిత లెందైన నుండిరని రవంత యెఱింగినా వారినెట్టులేనిఁ దన ధన, బలాధికారములచే స్వాధీన పఱచుకొన వలయుననియు, వారు లొంగినా తన మహత్త్వమే యనియు వారెదురుఁదిరిగిన నేదియో యొక మచ్చుఁ దగిలించుకొని వారి వీరి పాదంబులపైఁ బడుటయు, నేరైన నిదియేమి బుద్ధియని యందలించిన వారిసాధ్వీత్వములఁ బరీక్షింపవెడలినఁ గలిగిన ఫలిత మిదియని చప్పరించుటయు మహేంద్రునకు మొదటి నుండియు నలవాటే. ఆరీతి స్వాతంత్రు పొందిన బహుమానము

లనేకముగఁ గల్గవు. ఇట్టివారు ప్రసిద్ధపురుషులలోఁ జాలమంది కలరు. ఇత్యాది గౌరవమైన దుర్మార్గపద్ధతి.

ఇంద్రుఁడు జలంధరుని వరంబుల నెఱుంగును. వాని ప్రజ్ఞాతిశయముల నెఱుంగును. ఒక్కొక్క బలవంతుఁడు పుట్టఁగనే వాని పంచప్రాణము లఱచేతనే పెట్టుకొనునుగాని యిట్టి విచిత్ర నటనముల మాత్రము మానఁడు. నారదుఁడు మాటవరుసకే యనెనో లేక నింద్రునకుఁ గొంత మందలింపు జరుగవలెననియే యుద్దేశించెనోగాని యింద్రుఁడప్పుడే బలిపురంబున కరిగి తులసీదేవిని గనుఁగొని తన వికారస్వభావములను బైటఁ బెట్టుచుండెను.

నారదుఁ డొకచోట నుండువాఁడా ? ఒక నాటకమును ప్రారంభించి దాని బూర్తిఁజేయకుండ మఱియొక కార్యక్రమమును సిద్ధము చేయునా ? వెంటనే యమరావతినుండి జలంధరమున కరిగి జలంధరునితో మహేంద్రుని చర్యల నెఱింగించెను. భార్య తన కక్కఱలేదుగాని తనయిల్లాలి నొరులు పరిభవించుచున్నారని విని యూరకుండునా? ఆమె పరమసాధ్వి యగునని యెఱుంగఁడా? తోడనే? గదాదండమును భుజంబుపై ధరించి బలిపురంబున కరిగెను. మహేంద్రుఁడు నోట వర్షింపఁ జేయుచున్న శృంగారరసమిళిత వాక్యముల నాలించెను. సాధ్వి తులసి వచించుచున్న హితముల నాలించెను. కొంతతడవు

శ్రాంతించిన నేమిజరుగునోయని వెనుకాడెను. ఇంతలో నింద్రుఁడామెను బలాత్కారమునఁ బట్టుకొనఁదలఁచినంత నామె పరమేశ్వర నామోచ్చారణ మొనర్చి గట్టిగా, "నిట నాపద్బాంధవు లెవ్వరును లేరా,"యని యఱచి తన భీకరవిగ్రహరూపంబును బ్రదర్శించెను.

(6)

ఆవిశ్వరూప ప్రదర్శన మవలోకించినంతనే యింద్రుని హృదయము తాఱుమాఱైనది. ఇతరుల సహాయము కావలసి వచ్చినది. తన ప్రాణములు నిలుచుట కాస్కారము లేకున్నది. సతీ ప్రభావము బాగుగాఁ గన్నులకు గోచరమైనది. గత్యంతరము లేదు. ఆసమయమున నుద్ధరించెడివారు లేరు. నారదుండు వలదు మొఱ్ఱోయని నెత్తిని నోరుపెట్టుకొని హితంబులఁ దెలుప వాని మాటలఁ దిరస్కరించి చేతఁ దిరస్కరణీ ఘుటిక యున్నది గదా యని పరువెత్తిన త్రిదివసామ్రాజ్యాధిపతి, బృహస్పతి యనుంగు శిష్యుఁడు, శ్రీమహావిష్ణుని ప్రియసోదరుఁడు, దేవతా సార్వభౌముఁడు తులసీదేవి పాదంబులపై శిరంబు మోపి "తల్లీ! బుద్ధివచ్చినది. చెంపలఁ గొట్టుకొందు. మహాపరాధిని. క్షమియింపవలయును. నీవు గాక నన్నిప్పుడు రక్షింపఁగల వారెవ్వరును లే"రని గోలఁబెట్టి నాకమునకు మఱలిపోవ సెలవడుగుచుండ నాసమయముననే గదాధరుండగు జలంధరుఁడు ప్రళయ

కాలరుద్రునివలె సాక్షాత్కరించి యింద్రుని మెడఁ బట్టుకొని గదాఘాతంబునఁ ద్రెళ్లఁజేయ నుంకించెను.

మహాసాధ్వియగు తులసీదేవి "మనోహరా ! ఈతండు నన్ను స్పృశింపలేదు. మీమీఁద నాన"యని యాటనడచిన వృత్తాంతమంతయు విన్నవించినంత జలంధరుండట్లయ్యెను, దన కాజన్మద్వేషియగు మహేంద్రుని విడువనిచ్ఛగింపక "ఓరీ ! దురాత్మా ! నాభార్యసతీత్వమును నీవేనా పరీక్షింపఁగలుగు ధీమంతుడవు? సరేనీవిషయముపూర్తిగాఁగనుఁగొనవలయు"నని చెప్పుచుఁ దనపరివారమును రావించి "వీనిఁగొనిపోయి జలంధర మున బంగిలోఁ బెట్టియుంచు"మని యాజ్ఞనొసంగ వారటులఁ గావించిరి.

"ఇంద్రుండు బంధింపఁబడియె నింకఁ ద్రిదివ సామ్రాజ్యాధిపత్యము సులభముగా గ్రహించనగు"నని చంక లెగుర వైచుచు జలంధరుఁ డమరావతి పోవఁదలఁచు నంతలో నారదుఁ డటకుఁ బ్రత్యక్షమయ్యె. మహర్షి రాకకు జలంధరుఁడు నమస్కరించెను. తులసియు వందనంబిడెను. నారదుం డిరువురను దీవించెను. ఇంద్ర పరాభవము నారదుని సహాయ సంపత్తిచే జరిగినందున జలంధరుండా నారదునకుఁ బ్రత్యుపకృతిసేయఁ దలపెట్టి "యేమికోరెదవో యర్థింపు"మన నారదుం"డోయీ నాకేమియు నక్కఱలేదుగాని నీ యిల్లాలి సేతలుకోను"మని

పలికెను. అతం డందుల కంగీకరింపనందున నారదుండు
"జలంధరా! చివఱకు నీభార్యను నీ మందిరంబున నుండనిమ్ము,
నీవు లేని యదనుంజూచి యెవ్వరైన హరింపంగలరు. జాగ్ర
త్తసుమా" యని తెలిపినంత జలంధరుం డందుల కంగీకరించి
యా సాధ్విని జలంధరమునకంపి తాను సమరావనికిం జేరి
చింతామణీ పీఠముపై నధివసించి దేవతావర్గ మంతటిని నర
ణ్యముల పాల్జేసి కామధేనువును, నమృతకలశమును సంపా
దింపం బడరాని పాట్లంబడి యొందునుగానలేక జివఱకింద్రాణిం
బలువురి సమక్షంబునకు బలవంతమున రప్పించి మానభంగంబు
సేయం దలపెట్టినంత మహాపతివ్రతయగు తులసి యాకృత్యము
నెఱింగి యుచ్చోం దనమహాత్మ్యము వలన నవతరించి" మహా
సాధ్వుల నీరీతిం జేయుట మహాపాతక హేతువు. ఇందువలన
వంశక్షయము కలుగును. కాన నీమెనువదిలివేయుము. అనాధ
యసియామెను నిరాదరింపకుము అబలలబలలుకారు. వారినోట
శాపవచనంబు వెడలిన నయ్యది యమోఘమై పనిచేయును.
దేవతల యుసురు సామాన్యమైనది కా"దని హితంబుంగఱపి
నంతం గోత్రధారుణీతలోచనుండయ్యెం. జేయునది లేక నప్పటి
కామెనాపరిభవమునుండితప్పించి తనకుంగావలసిన కామధేనువు
మున్నగునవి యర్పించువఱకును బందెయుం డుండునటుల
నాజ్ఞాపించి మునిముఖ్యులం గొట్టుచు, యజ్ఞముల వమ్మొ
నర్చుచు, భూసురులనోట మాంసాదులం గుక్కుచు నానావిధ

హింసలఁ జేయుచుండెను. ఒక మహాసాధ్వి మానసంరక్షణ-
మొనర్చితిమి గదా యని తులసీదేవి యానందించుచుండెను.

(7)

జలంధరుని దుర్ణయముల కంతులేదు. శిశువులనక-
వృద్ధులనక, బుధులనక నెల్లఱ హింసించుటచేఁ దనివినొందక
మునులచేఁ బల్లకి మోయించుచుఁ జేయరానిపనులెన్నియో
చేయించుచుండెను. ఒకనాఁడొక యుద్యానంబునఁ జేరి మానవతీ
శిరోమణులనొక్కరొక్కరిఁ గారావించి వారలనెన్నో విధంబుల
హింసించుచుండ నాసమయమునకే నారదుండటకేతెంచి వాని
చర్యలనన్నిఁటి నవలోకించి తన మనంబునఁ "వీనికి నీతనికి
మృత్యుమార్గముఁ జూపకున్న ప్రపంచము లాగఁ జాల" దని
నిశ్చయించుకొని జలంధరునిచే గౌరవింపఁబడి యొకచోఁ
గూర్చుండి యాదైత్యనాయకుని జేరువకుఁ బిలిచి "జలంధరా!
నీకొకరహస్యం బెఱిగింతు. నీయందచందములకు, నీయధికార
మునకు, నీబలమునకు నీకాంత లీడువత్తురా? సరియగు కాంత
నెన్నుకొనవలె" నన నాతఁ డాతురముతో "మహానుభావా!
మీయడుగులకు మ్రొక్కులొత్తెద. అర్హురాలగుకాంతయెవ్వరో
చూపించు" మన నాతండు తన శక్తివలన యొక్కింత దవ్వుగాఁ
బార్వతీదేవిని జూపించెను.

అయమ్మ రూపరేఖావిలాసములఁ జూచి జలంధరుండు
విభ్రాంతుఁడై యొకతేని నామె సాంగత్యమును సంపాదించి-

తీఱవలయునని నిశ్చయించి యొంటరిగా నాదెసకుఁ బరువెత్తెను. వీనికిఁ జేటుకాల మాసన్నమైనదని నారదుండెంతయో సంతసిం చెను. జలంధరుని పాలిఁట పెద్దమ్మ మెల్లఁగా దాఁపురముగు చున్నది. దేవతల కగ్రగణ్యురాలు; లోకజనని తనస్వాధీనముగు నని గంపెఁడాశకాఁబోలు? ఆమె కొఱకై పరువిడుచుఁ దవ చెఱనున్నవారి నందఱి విడుచునటుల నాజ్ఞాపించెను.

వీని పోకడ తులసి గ్రహించినది. భీతాకులచిత్త యైనది. ఏదోప్రళయముఁ రాఁగలదని నిశ్చయించుకొన్నది. నారదునికడకుఁ బరువెత్తుకొనివచ్చి వృత్తాంతమంతయు నెఱిం గినది. వాని సలహా ననుసరించి పార్వతీపరమేశ్వరుల మన సార స్మరించి వారిఁ బ్రసన్నులఁ గావించుకొని శరణము వేఁడెను.

(8)

దుర్మార్గుఁడగు జలంధరుఁడు పార్వతినిగని కామోద్రే కుఁడై పిచ్చికూఁతలఁ గూయసాగెను. ఆమె హితోక్తులచే వాని మందలింపఁ జూచెఁగాని సాగలేదు. శివునకుఁ బనికల్గినది. మహోగ్రక్రూర తేజోన్వితంబగు శూలముతోనొక్క పోటుఁ బొడువ నాపోటుతో జలంధరుఁడు మూర్ఛాగతుండయ్యె. పతిగతించెఁగాఁబోలునని తులసి దిగులందిరుద్రుని పాదంబులపైఁ బడి పతిభిక్షఁ బెట్టుమని మ్రొక్కెను. వార లామెమొఱ నాలించి కోరినవరంబొసంగియంతర్ధానమైరి.

కొంతవడికి జలంధరుఁడు దురాత్మునుండి తెప్పరిల్లి యాంతటితో బుద్ధిఁ దెచ్చుకొనక, మరలఁ బార్వతి కొఱకై వెదుకుచుండసాగెను. "నాథా! అట్టి జగజ్జననిమీఁద మీరిట్టి దుష్కార్యమునకుఁ బూనుకొనుట తగదు. నామాట వినుఁ"డని తులసీదేవి తనబాగుకొఱకై హితంబుఁ దెలుప నా హితంబులాతనికిఁ గంటకములై "యీ యాఁడుది జీవించి యున్నంతవఱకు నా కేమియు సుఖములేదుగదా!" యని మనంబున నిశ్చయించుకొని పరిజనులఁ గొందఱి రావించి రహస్యముగ నామహాసాధ్విని బంధించి సముద్రమునఁ బాఱవైచు నటుల నాజ్ఞాపించెను.

రాజు తలఁచుకొనిన దెబ్బలకుఁ గొదువ యగునా? పరిజనులుతోడనే యటులఁ గావించిరి. ఇన్నాళ్ళనుండి పతివ్రత యని యనిపించుకొనుచు శ్రీయఃపతి పదారవిందభజనముఁ గావించుకొనుచు మెలంగుచుండిన సాధ్విని నీతరుణమున రక్షించెడి వారు లేకుందురా? తోడనే యార్తత్రాణపరాయణుండగు విష్ణుం డట నవతరించి, యమ్మహాదేవిని యొడ్డునకుఁ గొనివచ్చి కట్లువిప్పి యాపె యెవ్వరోకనుఁగొని తల్లీ! పరమదుర్మార్గుఁడగు నీపతి యెంతచేసెనో చూచితివా? అట్టివాని చెంతనుండుట కన్న వైకుంఠమున నాసముఖమునందుండి సకలసుఖంబులనందు" మని తెలిపినంత "శ్రీదేవాధిదేవా! భగవంతా! [illegible]

పతిబ్రతుకొక బ్రతుకా? నన్నేటికిఁ బరీక్షింతువు? నాయందను
గ్రహించి యన్ను నాథుని బ్రతికఁజేయు"మని ప్రార్థించినంత
నా మాంగల్యములనే కొనియర్పితనని సమాధానపరచి యంతలో
బ్రహ్మాదిదేవతల కేకవినవచ్చినంత నాయమ్మను నొక్కతూరి
కన్నులఁజూడుమని యూహాపించి యదృశ్యుఁడయ్యెను.

[9]

బ్రహ్మ విష్ణుమహేశ్వరులు తమతమపరివారములతోఁ
గైలాసమునసభఁజేసి జగత్కంటకుఁడైన జలంధరుని వధించు
టనుగూర్చి యోచించి తులసీదేవి పతివ్రతాత్వమును హరిం
చుటకును, జలంధరునిహస్తమున నొప్పు శంఖమునుసంగ్రహిం
చుటకును దీర్మానించిరి. మోహావేశునిఁ గావించి జలంధరుని
కడనుండి శంఖమును సంగ్రహించుటకై మాయాపార్వతిని
సృష్టించెడివాఁడు పితామహుఁడిది. తులసీదేవి పాతివ్రత్యమును
భంగమొనర్చెడివాఁడు శ్రీమన్నారాయణుఁడిది. సమయముఁ
గనిపెట్టిత్రిశూలముచే నాతనిఁ బొరిఁగొనెడివాఁడు శంకరుఁడిది.

ఈ యేర్పాటు లాదేవత లొనర్చుకొనినతోడనే శ్రీమ
న్నారాయణుండు మఱల నెప్పటియటులఁ దులసీదేవియెదుట
సాక్షాత్కరించిన సమయమందే జలంధరుని రూపంబును దవ
హృదయఫలకంబునఁ జక్కఁగాఁ జిత్రించుకొని పతిపూజా
తత్పరయై యుండె శ్రీమన్నారాయణుండు జలంధరుండయ్యె.
"ప్రేయసీ ! తులసీ ! యని సంబోధించెను.

ఆయమ్మకుఁ బ్రాణములు లేచివచ్చెను. తన ప్రాణే శ్వరుని కానాటికనుగ్రహము కలిగెఁగదా యనియుప్పొంగెను. నిజముగాఁ దనప్రాణేశ్వరుఁడే యని విశ్వసించెను. సంతసముచే నొడలుఁ దెలియక మూర్ఛిల్లెను. మూర్ఛ మునింగిన యా తలోదరిని శ్రియఃపతి తన తొడలపైఁ జేర్చుకొని శీతలోప చారము లొనర్చుచుండ నామె చైతన్యముఁగాంచి సిగ్గునఁ దలవంచుకొన "హృదయేశ్వరీ! ఇంతకాలము నిన్ను నిరాద రణముఁ జేసితినని నాపైఁ గినలకుము. నన్ను క్షమింపుము. నేసింకనీవాఁడ" నని యేమేమో ప్రియ భాషణములచే నామె నలరించుచుండెను.

(10)

దేవతా సభాతీర్మానము ననుసరించి శ్రీ మహావిష్ణు వీయుద్యోగముననుండఁ బితామహుండు మాయాపార్వతిని సృజించి జలంధరునిపైకంప నామె తన హావభావవిలాసములఁ బ్రదర్శించి యెట్టటులో నాతని చేతనున్న శంఖమును లాగుకొ నియెను. ఇంతలో శంకరుఁడు తన త్రిశూలముచే జలంధరుని శిరంబు ఛేదించివైచెను, దానవపురోహితుండగు శుక్రుండు జలం ధరునిశిరంబును దులసీదేవికిఁజూపింపఁదలంచి యాశిరంబుఁగొని యటకుఁజేరెను. మాయాజలంధరుని సరససల్లాపము లట్టులనే యుండెను. ఈసమయంబున నాశుక్రాచార్యుం డామెముందు శిర

బుఁజూపెను. మీఁదుమిక్కిలి "అమ్మా! ఈతండు నీపతియని భ్రమించితివా? అటనుండి యీవలకు రమ్ము. శ్రీమహావిష్ణువొనర్చిన మోసకృత్యమిది" యని వచించెను. వెంటనే "హా! యని యార్చుచు మొదలు నఱికిన కల్పతరువు వోలె మూర్ఛిలి కొంతవడికిఁ జైతన్యముఁ దెచ్చుకొని విష్ణుమూర్తిని జూచి "సృష్టి స్థితిలయకారణభూతుండవై, జగదారాధ్యుఁడవై విలసిల్లెడి నీవు, నన్ను, వివాహమైనది మొదలు పతియే దైవంబని విశ్వసించి మెలంగుచున్న నన్ను, ప్రాణపతిచేఁ దిరస్కృతనయ్యునాసువాసినీత్వము చెక్కుఁ జెదరకున్న నదియే పదివేలని సంతసించెడి నన్ను, నాపతిని నెట్టులైన నావాడఁ బ్రిసన్నునిఁ జేయ రేయని నెత్తిని నోరుపెట్టుకొని మీతో మొఱఁబెట్టుకొనిన నన్నుఁగాపాడిన విధానమా యిది? రమామనోహరా! నాపతివ్రతాత్వమును జూచి నీకన్నులు కుట్టినవా? ఇంత దుర్మార్గమా? ఇంత దౌష్ట్యమా! దురంతకులగువారు పతివ్రతామణులఁ బరిభవింపఁదలఁచినపుడు బన్నంబులఁ ద్రోలఁగింప మొఱఁబెట్ట వారి నుద్ధరింపవలసిన కృపాపరతంత్రుఁడవే, దేవాదిదేవుఁడవే? నీవే నీధర్మములను నట్టేటఁ గలిపి యిట్టి కపటకృత్యమునకుఁ బాల్పడినపుడు మానవతుల కీముల్లోకముల నిలువనీడ కలదే? నిన్ను దూరిన మాత్రాన, నిన్ను శపించిన మాత్రాన నీ దుర్ణయము దుష్కృతము నాదేనే" యని యింక నేమేమిగనో తులసీదేవి విష్ణుమూర్తిని నిష్ఠురోక్తు లాడుచుండ నాదేవుండు "సతీ

మణీ! ఏల తొందరపడి నన్ను నిందించెదవు? నావిన్నప
మాలింపుము. నేను జగద్భద్రసంధాయకుఁడనగుటఁ జేసి
నావిధికృత్యంబు నెఱవేర్చుకొనక తప్పదు. పూర్వజన్మంబున
నీవు దేవకాంతవై, నాప్రియసతియగు కమలకు చెలివై నాపొందు
నభిలషించి చిరకాలంబు తపంబొనర్చియుఁ దత్ఫలంబు నావలనఁ
బొందక యీజన్మంబున నాభాగ్యముఁ బొందితివి. నీవు నావలన
నిటు మోసగింపఁబడుటకును హేతువు కలదు. ఆజన్మంబున
నాపైఁగలతమి నిలుపుకొనఁజాలక లక్ష్మీదేవి లేనిసమయంబుఁ
జూచి నీవు నాకడకువచ్చి నన్ను మోసగింప నుద్యమించుతఱి
లక్ష్మీదేవి యటనవతరించి యీమెవలన నీజన్మంబున నీవిధం
బుగా మోసగింపఁ బడెదవని శపింపఁబడితివి. అంతియగాక
నాశాప ఫలమింకఁ బూర్తికాలేదు.

పరులచే మోసగింపఁ బడెదవనెడి శాపంబుఁ బొంది
నపుడు నీవు నీతప్పిద మొప్పుకొని కరుణింపుమని పద్మాలయ
నువేడ నామెనీయెడఁ గరుణించి నాసహాయమర్థింప నీకన్యా
త్వము చెడకుండునటులను, నీవు నావలననే భంగమందునట్టు
గను, నంతనీవుచితిఁజొచ్చి లోకంబున నేకవ్రతువువై సకల
జనులచేఁ బూజింపబడునటులను శపించినదంతయు జరిగితీర
వలయునుగదా" యని వచింప నాసమయముననే పంచభూ
తములు నన్నిహాసియుని వాక్యము లెంతయు నమ్మఁదగినవని
సాక్ష్యమొసంగెను.

సాధ్వీ శిరోమణియగు తులసీదేవియు నదివఱకుఁ దన పూర్వజన్మకృతదోషఫలమని గుఱుతెఱింగి భర్తృశిరంబుఁ చేఁగొని "హా! ప్రాణపతీ, నా కెట్టి దుఃఖమును గూర్చితివి? వలదు, మానవతుల సాంగత్యము నభిలషింప వలదు, లోకపాలురతో వైరంబువలదు, అయ్యది వినాశహేతువని యెంతే గోలపెట్టినను వినక నీ విధాన మృత్యువును జేతులారఁగొని తెచ్చుకొంటివా? నాథా! నన్నెంతగా నీసడించుకొనినను, నా మాంగల్యము చెదఱకున్నదియే పదివేలని సంతసించుచున్నింతదాక మెలంగితివే. ఇంక నేమి చూచుకొని జీవించుదాన" నని పెల్లున దుఃఖించి లక్ష్మీకాంతుఁ డొనర్చిన మోసకృత్యమునకు హృదయమునుండి పై కుబుకుచున్న యాగ్రహమును నిలుపుకొనఁజాలక శ్రీమహావిష్ణుని దిక్కుఁ గాంచి "ఓయీ! దానవవైరీ! ఏవిషయమెట్లున్నను నీజన్మమున నేకల్మషమెఱుంగని మానవతినగు నన్నీవిధంబున దయాదాక్షిణ్యరహితుఁడవై, వావివరుసవిచక్షణాశూన్యుఁడవై, బిరుదావళినెల్ల నాశ మొనరించుకొని నాపతివేసమూని యీవిధినీవు మోసగించితివి గాన పాషాణమవై యీ యన్యాయమునకుఁ దగినఫలమనుభవింపు"మని శపించినంతవిష్ణువు పాషాణగతి నందె.

సాక్షాద్విష్ణుఁడు, లోకరక్షకుఁడు తనచే నీవిధిఁ బాషాణగతిఁ గాంచినంతనే యామెహృదయమున కెంతయు జాలికలిగినది. "అయ్యో! పాతివ్రత్యమునుగంటిపోయెనను, రోషపర

వశనై యొడలెఱుంగక పలికినపలుకుల చేనీమహామహుండిట్లగునే! అక్కటా? లోకముల కెట్టిభంగపాటుం జేకూర్చితిని? నాపలుకుల యందింత విలువ లేదనుకొంటి"నని తులసీదేవి తనతొందరపాటు నకుం దానే పశ్చాత్తాపమంది యంతలోఁగొంతజ్ఞానమును దెచ్చు కొని "యోహో! భగవంతుని నిష్కారణముగా దూషించి తిని. జగత్కారణుండును, ధర్మరక్షణపరాయణుండును, బరమ కరుణానిధియునగు నీమహానీయుండేదియు నాలోచనము లేక సేయఁడు. తులసి సాధ్వియేసుమాయని లోకమునకు నిరూ పణ సేయుటకే తానిట్లు తన బిరుదావళిని నిల్పుకొనినాం" డని యాదేవాదిదేవుని గాఢముగా మనంబున నిల్పుకొని తన యపరాధంబును సైరింప వేఁడుకొనుచుండెను.

ఇట్టితరుణముననే లక్ష్మీదేవి తనపతిపొందినభంగపాటుం దెలుసుకొనిపర్వెత్తుకొనివచ్చి పతిభిక్షకై యర్థించెను. "అమ్మా! అమ్మహానీయుని యథారూపమునకుం దెచ్చుటకు నాకడఁ బ్రజ్ఞ కలదా? అయినను నేనిప్పుడే చితిఁజొచ్చెద. పవఁపడి నమ్మహా నీయుఁడు నాసాధ్వీత్వమును నిలుప నెటులఁ బాషాణగతి నొందెనో యటులనే నాసాధ్వీత్వమును లోకమునఁ బ్రచుర పఱచుటకు యథారూపంబందుగాక" యని యామెను సమాధానపఱచి యొకచితిఁబేర్చిందుకొని స్వాహావధూవల్లభుని మనసారఁ బ్రార్థించి యందుఁజొచ్చి భస్మమయ్యెను. విష్ణు

దేవుండు యథాస్వరూపమందెను. ఆమెసమాధినందినప్రదేశముపై నొక మొక్క మొలిచెను.

విష్ణుదేవుం డామొక్కకుఁ దులసీవృక్షమనెడి పేరొసంగి యయ్యది భక్తజనులపాలిఁటఁ గల్పవృక్షమై దనరారునటులను సమారాధ్యముగ నుండునటులను వరంబు ననుగ్రహించె.

ఆ తులసీవృక్షమునే మనదేశములో నింటింటను నెల కొల్పిపూజించిసకలాభీష్టములఁ బడయుదురు. తులసీవృక్షమును నాటుట, దేవళంబుఁ గట్టించుటకంటెఁ, దటాక నిర్మాణము కంటె, నారామమును వేయించుటకంటె, బావిఁ ద్రవ్వించుట కంటెఁ, గృతులనందుటకంటె మహత్తరమైనదని మన పెద్దలు మనకు బోధించుచున్నారు.

తులసీదేవి కావలయునని హృదయపూర్వకముగా జలంధరుని ప్రేమించి, యీశ్వరానుగ్రహమున వానినేభర్తగాఁ బడసి, వానిచే నతిహైన్యముగఁ జూడఁబడియుఁ బుట్టింటి మొగముఁ జూడకఁ బత్యారాధనమే సతికి సద్గతికి మూల మని విశ్వసించి, మెట్టి యిక్కట్టులు వాటిల్లినను శాంత హృదయమైవానినెల్ల ననుభవించి పతిశ్రేయమునేగోరి, వానికిఁ గలుగనున్న మహావిపత్తుల నెన్నిఁటినో తప్పించిన మహాసాధ్వి.

పతివ్రతలతోఁ జెలిమిఁగోరుట త్రాచుఁబాముతోఁ జెలగాటవంటిది. వారు భగవత్పూజాతత్పరలగుటచే, సత్య

వార్ధకులగుటచే, సదాచారశీలురగుటచే, స్వార్థత్యాగులగుటచే, మహిమాంగనలని యనిపించుకొని భగవంతునిచేఁగూడఁ గీర్తింపఁబడినవారు. పతివ్రతల గాసిఁబెట్టినవారెవ్వరును బాగుపడలేదు సరిగదా వారి వంశములు సమూలముగా నాశమయ్యెను. మహిమాంగనలిచ్చెడి శాపములు బుద్ధిపూర్వకముగాఁ దెచ్చుకొనఁబడెడి వగుటచే వానినిబరాత్పరుఁడైనను తప్పింపజాలఁడు. వారికిఁగలశక్తు లనంతములైనవి. పరాత్పరుఁడు వారికేలొంగియుండును.

మహత్తర శక్తులుగల యిట్టివారి యుత్తమ చారిత్రములఁ జదువఁ జదువ నానంద ముదయించును. ఆనంద ముదయించు కొలఁదిని సదాచారముల దెసకు బుద్ధి మరలును. ఆచారములచేఁ దమజన్మ సార్థక పఱచుకొనిన వారిహంబునఁగీర్తిఁ జెందుటయగాక పరంబునముక్తిఁ జెందెదరు. ఇంతకంటెఁ గావలసిన దేమున్నది?

ఒక్కొక్కరి చరిత్ర యొక్కొక్క విషయమున మన కాదర్శప్రాయ మగుచున్నది. ఆచరించెడి విధానములు వేరయ్యెను. వ్రతమొక్కటే, ఫలమొక్కటే.

పాఠశాలల కుపయుక్తములని అప్రూవు కాబడిన

# ఉపవాచకములు.



| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీకృష్ణ చరిత్రము | (29- 1-29) | 0--10—0 |
| 2. | పల్నాటివీర చరిత్రము | ( 9- 4-29) | 0—6—0 |
| 3. | శ్రీరామ చరిత్రము | (13-11-28) | 0—8—0 |
| 4. | ధ్రువోపాఖ్యానము | (19-11-29) | 0—3—0 |
| 5. | అహల్య | (19-11-29) | 0—4—0 |
| 6. | కుచేలోపాఖ్యానము | (19-11-29) | 0—2—0 |
| 7. | ప్రత్యక్షబాలబోధ | (19-11-29) | 0—2—0 |
| 8. | భక్తిబాలబోధ | (19-11-29) | 0—2—0 |
| 9. | పుత్రీహితబోధిని | (19-11-29) | 0—3—0 |

# నూతన ప్రచురణములు.



| | | |
|---|---|---|
| 1. | కధాగుళుచ్ఛము | 0--12—0 |
| 2. | మహీమాంగనలు [ప్రథమభాగము.] | 0—5—0 |
| 3. | మహీమాంగనలు [ద్వితీయభాగము.] | 0—5—0 |

ఇంకను తదితర గ్రంథములు మావద్ద లభింపగలవు.

వలయువారు:—

ప్రొప్రయిటరు:—

కాసంశెట్టి శేషగిరిరావు అండు బ్రదర్సు,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,

ఏలూరు, (పశ్చిమగోదావరి జిల్లా.)